# శీఘ్రంగా అన్ని రకాల బాధల ఉపశమనం

జలుబు :
[illegible]

గుండెజలుబు :
[illegible]

75 ఏళ్ల పైగా ప్రఖ్యాతి చెందిన
అమృతాంజనము

# అమృతాంజనము




AMR-3/Tel

# అన్ని వంటలకు శ్రేష్ఠమైన నూనెలు

అగ్‌మార్కు కాబడిన
ఎ.యస్. బ్రాండ్
## చాయపప్పు నూనె

అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......
## నువ్వులనూనె

- గింజలపండేల్లా నువ్వులనుండి ఆరోగ్యకర ముగుప్రత్యేకపద్ధతులతో తయారు కాబడినవి.
- రుచి రంగు సువాసనలతో అన్నివంటు పదార్థములను అమితముగురు చివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును, ముక్క మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 15, 4, 2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

ఏజంట్సు :
శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
శివాలయం వీధి, విజయవాడ

డిపోలు :
శ్రీ G. సుబ్బారావు,
వుళ్ళక్కి స్ట్రీటు, తెనాలి

శ్రీ B. గోపాలకృష్ణమూర్తి,
1-3-166, రాజా ముదలియార్ స్ట్రీటు
కలాసిగుడ, సికింద్రాబాద్

MFRS. అంబటిసుబ్బన్న&కో.

పచ్చని పల్లెవాతావరణంతో, సజీవమైన పాత్రలతో
అఖిలాంధ్ర ప్రేక్షకులను అలరించే కమనీయ చిత్రం






ఆదుర్తి సుబ్బారావు సమర్పించు

బాబూ మూవీస్

# "ఉండమ్మా బొట్టుపెడతా"

సి. సుందరం దర్శకుడు కె. విశ్వనాథ్ సంగీతం కె.వి. మహదేవన్

# ఒకడజను యింత చక్కని ఫోటోలు తీయండి




# ...కెమెరా కొన్న రోజునే Agfa క్లిక్ III

మొదలు పెట్టుటకు శ్రేష్ఠమ
వరం పెట్టుట కష్టము!

* గురిపెట్టి క్లిక్ చెయ్యండి. చిక్కుపెట్టే సాధనా లేమీ లేవు. పొరబాట్లు చేసే అవకాశంలేదు.
* 120 సైజు రోలు ఫిల్ముమీద 12 పెద్ద (6X6సెం. మీ) ఫోటోలు తీయవచ్చు.
* ఎవరెడీ కేసు పోర్ట్రెయిట్ లెన్సు, యింకా ఫ్లాష్ గన్ అదనంగా కొనుక్కోవచ్చు.



కళ కళ లాడే ప్రింట్లకు,
ఎన్‌లార్జ్‌మెంట్లకు ఆగ్ఫా ఫొటో
పేపర్లు మాత్రమే కావాలని అడగండి

ఆగ్ఫా పర్యవేక్షణ క్రింద తయారుచేయువారు : ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా.



దేశానికంతా డిస్ట్రిబ్యూటర్లు :
ఆగ్ఫా-గెవర్టు, ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూఢిల్లీ • కలకత్తా • మద్రాసు

CNAG-103 203 TL

## తల్లిదండ్రులారా! చిన్న పిల్లల పాదాల విషయం ఉపేక్ష చేయకండి...
## వారి జీవితాంతం అవి బాగుండాలి!

బాటా లిల్లిపుట్, చేతలోనే వుంది ఆ నేర్పు. పాదాలకు హాయిగా, సదుపాయంగా వుంటాయి.
ఎదిగే పాదాలకు వాటిని మించినవి లేవు. ముద్దులొలికే స్టైల్సు. మృదువైన
కమ్మకమ్మని చర్మం. చిట్టి పాదాలకు మెత్తగా వుంటాయి. కాలి వేళ్ళకు
కావల్సినంత జాగా వుంది. హీలు ఏర్పాటు బాగుంది గనుక అడుగు సరిగ్గా
పడి బాగా నడుస్తారు. హీల్సు గట్టిగా వుండవు గనుక చకచకా
బాటా లిల్లిపుట్ అంటే శాస్త్రీయ పద్ధతిని సరిగ్గా సరిపోయి
సదుపాయంగా వుండేలా చేసిన జోళ్ళు. అన్ని విధాలా తగినవి.
మీ పిల్లలకు తప్పకుండా కొనవల్సిన జోళ్ళు. త్వరగా రండి.
సరిపోయే జోళ్ళు చూసి ఇస్తాం.





**Bata**

# లిల్లీపుట్

ఎదిగే చిట్టి పాదాలకు జోళ్ళు



ప్రత్యేక సదుపాయం!
సరకు ఉన్నంత వరకే
60 పైసల ఖరీదైన
ఆకర్షణీయమైన
ప్లాస్టిక్ గ్లాసు 10 పైసలకు
మాత్రమే ఈ డబ్బాలో
లభిస్తుంది
Cadbury's
Bournvita
deal food drink
ngth and vigour
OFFER!
450g
net
ఈ లేబుల్‌ను చూడండి
Bournvita
FOR STRENGTH AND VIGOUR
బలము, శక్తి
మరియు
బోర్న్‌విటా!
Bensons-0460 TEL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["పట్టపరీక్ష"] పి. జాన్‌బాబు పంపిన కథ ఆధారంగా రచించినది. మనుషుల విలువలను ఆనవాయితీని బట్టి నిర్ణయించరాదు. పరీక్ష పెట్టినప్పుడే మనిషి యొక్క నిజమైన విలువ బయటపడే అవకాశం కలుగుతుంది. ఈ నీతి మనకీ కథలో కనబడుతుంది.

"వింతసమస్య" అన్న కథలో కూడా చక్కని నీతి ఉన్నది. ఏ పని అయినా చిత్తశుద్ధిగానే చెయ్యాలి గాని, పై మెరుగులు చూసి భ్రమపడరాదు.

సంపుటి 43 అక్టోబర్ '68 సంచిక 4







# భారత చరిత్ర




ఒకప్పుడు మొగలుల చేత దెబ్బతిన్న సిక్కులు, మొగలుల బలం సడలే సమయానికి తిరిగి తమ శక్తులను కూడగట్టుకుని, 1773 నాటికి తమ రాజ్యాన్ని ప్రతిష్ఠించుకున్నారు. అది తూర్పున షాహ్‌రాన్‌పుర్ నుంచి పడమట అటోక్ దాకానూ, దక్షిణాన ముల్తాన్ నుంచి, ఉత్తరాన కంగ్రా, జమ్మూల దాకానూ విస్తరించి ఉండేది. అది పన్నెండు సంయుక్త రాజ్యాలుగా ఉండేది. అయితే సిక్కులకు శత్రుబాధ లేకుండా పోయేసరికి వారి మధ్య ఐకమత్యం సన్నగిల్లి, అంతః కలహాలు బయలుదేరాయి. ఒక వంక భారతదేశం బ్రిటిషువారి అధీనంలోకి వస్తూ ఉంటే సిక్కునాయకులు రాజస సంస్కృతిని అవలంబించి ఐకమత్యాన్ని కోల్పోసాగారు.

ఈ దశలో సిక్కుల రాజసాన్ని వదలగొట్టి, జాతీయ భావాలనూ, ఐక్యతనూ వారిలో పెంపొందించినవాడు రణజిత్‌సింగ్. ఇతను 1780 నవంబరు 2న జన్మించాడు. ఇతని తండ్రి మాహాసింగ్ సుకేర్‌చకియా రాష్ట్రానికి నాయకుడు. 1793లో కాబూలులోని జమాన్‌షా భారతదేశంపై దండయాత్రలు ప్రారంభించేనాటికి రణజిత్‌సింగ్ పదమూడేళ్ళ పసివాడు. 1798 దాకా సాగిన ఈ దాడులలో అతను జమాన్ షాకు ఎంతగానో సహకరించాడు. అందుకు ప్రతిఫలంగా జమాన్‌షా రణజిత్‌సింగును, అతని 19వ ఏటనే లాహోరుకు గవర్నరుగా నియమించి, రాజా అనే బిరుదు ఇచ్చాడు.

అది మొదలు రణజిత్‌సింగ్ అప్రతిహతమైన రణకౌశలం ప్రదర్శిస్తూ, పంజాబులో అఫ్ఘనులకు తావు లేకుండా చేశాడు; బలమైన సిక్కు జాతీయరాజ్యం వ్యవస్థాపించాడు. అంతేగాక చెల్లాచెదురుగా వున్న సిక్కులను ఒకే రాజకీయవ్యవస్థ కిందికి

## 85. రణజిత్‌సింగ్



తీసుకురావటానికి అతను చాలా కృషి చేశాడు. ఇందుకొరకై సట్లెజ్, జమునల మధ్య ఉన్న సిక్కురాజ్యా లన్నిటినీ అతను తన అధీనంలోకి తెచ్చుకోవలసి ఉండెను. అవి మహారాష్ట్రుల రక్షణకిందా, దరిమిలా బ్రిటిషువారి రక్షణకిందా ఉంటూ వచ్చాయి. దీనికి తోడు సిక్కునాయకుల మధ్య తీరని అంతఃకలహాలుండేవి.

చివరకు ఇవే రణ్జిత్‌కు తోడ్పడ్డాయి. ఎందుకంటే అక్కడి సిక్కునాయకులలో కొందరు అతని సహాయం అర్థించారు. ఇది అసరాగా తీసుకుని అతను సట్లెజ్‌తీర రాజ్యాల మీదికి దాడులు చేసి, 1806, 1807 లలో లూధియానాను ఆక్రమించాడు. రణ్జిత్ విజృంభణ సహించలేని సిక్కునాయకులు 1808 మార్చిలో, ఢిల్లీలోని బ్రిటిషు రెసిడెంటుతో మొరపెట్టుకున్నారు.

రణ్జిత్ బలవంతుడు కావటం బ్రిటిషు వారికీ ఇష్టంలేదు. కాని భారతదేశపు వాయువ్య సరిహద్దున ఉన్న బలవంతుడితో విరోధం తెచ్చుకోవటం వల్ల తమకు నష్టం కలుగుతుందనీ, తురుష్కులనూ, పర్షియనులనూ కలుపుకుని ఫ్రెంచివారు యుద్ధానికి వస్తారనీ భయపడి, బ్రిటిషువారు రణ్జిత్ సింగుతో ఒక సహకార సంధి ప్రతిపాదించారు. ఫ్రెంచివారికి విరుద్ధంగా రణ్జిత్ సహాయం పొందటమే గాక, అతను యుద్ధం ద్వారా పురోగమించకుండా ఈ సంధి ద్వారా నిలుపు చేయాలని బ్రిటిషువారి ఉద్దేశం.



బ్రిటిషువారికి తన సహాయం లేకుండా జరగదని రణ్జిత్ గ్రహించాడు. సిక్కు రాజ్యా లన్నిటికీ తానే అధిపతినని గుర్తించినట్టయితే సంధికి ఒప్పుకుంటానని అతను బ్రిటిషురాయబారికి తెలిపాడు. కాని అంతలోనే, నెపోలియన్ భారతదేశం పై దండయాత్ర చేసే భయం తొలగిపోయింది.

ఇక బ్రిటిషువారికి రణ్జిత్ మైత్రితో అవసరం లేకపోయింది. అతని రాజ్యం





సట్లెజ్‌కి తూర్పుగా విస్తరించరాదని వారు తీర్మానించుకుని, ఒక బ్రిటిషుబలాన్ని పంపారు. రంజిత్ బ్రిటిషువారితో యుద్ధం చెయ్యదలచక, 1809 ఏప్రిలు 25 న అమృతసర్‌లో వారితో సంధి చేసుకున్నాడు. దాని ఫలితంగా అతను సట్లెజ్‌కి తూర్పుగా తాను గెలిచిన భూభాగ మంతా వదులుకో వలసి వచ్చింది. బ్రిటిషు సామ్రాజ్యం జమునాతీరం నుంచి, సట్లెజ్ ఎడమతీరం దాకా విస్తరించింది.

రంజిత్ తన రాజ్యాన్ని తూర్పుగా విస్తరించుకునే ప్రయత్నానికి స్వస్తి చెప్పి, ఉత్తర, పశ్చిమోత్తర, పశ్చిమదేశాల పైకి విజృంభించాడు. 1809-1811 మధ్య అతను గూర్ఖాలను జయించి, కంగ్రా జిల్లా వశపరుచుకున్నాడు; 1813 లో అఫ్ఘనులను ఘోరంగా ఓడించి, అటోకును వశపరుచుకుని, అఫ్ఘను రాజైన షా షుజా నుంచి జగత్ప్రసిద్ధమైన కోహినూర్ వజ్రాన్ని పుచ్చుకున్నాడు. ముల్తాన్ 1818 లోనూ, కాశ్మీరు 1819 లోనూ రంజిత్ వశమయాయి. 1823 లో పెషావరు అతని అధీనమయింది. 1824 నాటికి సింధు లోయలో చాలా భాగం రంజిత్ కిందికి వచ్చేసింది.

రష్యనులు దాడిచేస్తారని శంకించి, రంజిత్ రాజ్యాన్ని దాడికి అడ్డం పెట్టుకునే ఉద్దేశంతో బ్రిటిషువారు రంజిత్‌సింగుతో 1831 లో తిరిగి సంధి ఒప్పందం చేసుకున్నారు. అయితే ఇది రంజిత్‌కు ప్రతిబంధకమే అయింది. దీని మూలాన, రంజిత్ అఫ్ఘనులను జయించకుండానూ, సింధు దేశాన్ని తన రాజ్యంలో చేర్చుకోకుండానూ వారు అడ్డపడగలిగారు. అయినప్పటికీ రంజిత్ ఒక బలమైన రాజ్యాన్ని నిర్మించుకుని, దానికి ప్రతిష్ఠ సమకూర్చుకోగలిగాడు. అతను తన 59 వ ఏట, 1839 జూను 27 న మరణించాడు.





# మూలికా రహస్యం

కొంతకాలం క్రితం కపిశా నగరంలో మాధవు డనే సంపన్ను డుండేవాడు. అతని అత్తవారు కూడా ధనికులు. అందుచేత అతను కాలిమీదకాలు వేసుకుని, సుఖంగా ఎంతకాలమైనా జీవించటానికి అవకాశం వున్నది. కాని మాధవుడు అలా తినికూర్చునే ఘటంకాదు. అతనికి రసవిద్య సాధించా లన్న కోరిక చాలా బలంగా ఉండేది. రాగిని బంగారంగా మార్చటానికి అతను ఎన్నో ప్రయోగాలు చేసి, తనకున్న దంతా ఖర్చుపెట్టేసి, చివరకు నిరుపేద దశకు చేరుకున్నాడు.

మాధవుడి భార్య చాలా వివేకం గల మనిషి. నిక్షేపంగా అనుభవించ దగిన ఆస్తిని తన భర్త బంగారం మీది వ్యామోహంతో, సొంతం తగలేస్తాడని ఆమె ముందే గ్రహించి, గృహనిర్వహణలో ఎంతోశ్రద్ధ చూపింది. కాని ఆమె శ్రద్ధ అంతా బూడిదలో పోసిన నెయ్యివతు అయింది. ఇతరుల మాదిరిగా తన భర్త ఏ వ్యాపారమో చేసుకున్నా ఎంతో బాగుండిపోయేది. బంగారం మీదనే దృష్టి గల మాధవుడికి, భార్య చేసిన హెచ్చరికలూ, సూచనలూ ఏ మాత్రమూ తలకెక్కలేదు. పైపెచ్చు, ఒకవంక ఆస్తి అంతా హారతికర్పూరం లాగా హరించుకు పోతుంటే, అతను భార్యతో, "తొందరపడకు. బంగారం చేసే విద్య చాలావరకు దొరికిపోయింది. ఇంక కాస్తలో ఉన్నది," అన్నాడు.

మాధవుడి భార్యకు పరిస్థితి దుర్భర మయింది. ఆమె పుట్టింటికి వెళ్ళి, తన తండ్రితో తన కాపరం గురించి చెప్పింది. ముసలాయన అంతా విని, "అల్లుణ్ణి పిలిచి, నేను మాట్లాడుతాలే," అన్నాడు.

మామగారి ఆహ్వానం అందుకుని మాధవుడు వచ్చాడు.

జి. జగన్నాధరావు



"ఏమోయ్, నీ రసవిద్య ఎంతదాకా వచ్చింది?" అని మామగారు అడిగాడు.

మాధవుడు ఉత్సాహంతో తాను చేసిన ప్రయోగా లన్నిటిని గురించీ మామగారికి వివరంగా చెప్పాడు.

"అరరె, అసలు కిటుకు తెలీక ఇన్ని ఏళ్ళు వృధా చేస్తివే. నా సలహా ఏనాడో తీసుకోవలిసింది. నేను కూడా ఈ విద్య గురించి చాలా తెలుసుకున్నాను. ఇప్పటి కైనా నీ పని సులువని చెప్పను. చాలా ఏళ్ళపాటు నువు ఓర్పుతో పని చేయవలిసి ఉంటుంది. నాకు వృద్ధాప్యం వచ్చేసింది. నేను శ్రమపడలేను. ఆ పని నీ వల్ల అవుతుంది. నే నెరిగిన మూలికా రహస్యం నీకు చెప్పేస్తాను. నేను చెప్పినట్టు చెయ్యి, నీ కోరిక సిద్ధిస్తుంది," అన్నాడు మామగారు.

మాధవుడు భక్తిగా, "మామగారూ, మీరు చెప్పినది శ్రద్ధగా చేస్తాను. విజయం సాధించే దాకా విడిచిపెట్టను," అన్నాడు.

"నువు ఇంత కాలమూ రాగిని బంగా రంగా మార్చటానికి గద శ్రమిస్తున్నావు? అందుకు కావలసిన వస్తుసామగ్రి యావత్తూ నా వద్ద ఉన్నది—ఒక్క దినుసు తప్ప. మన ఓర్పును పరీకించి, హెచ్చుగా శ్రమ పెట్టే దినుసు కూడా అదే. అయితే దాన్ని సాధించటం అసాధ్యం మటుకు కాదు," అన్నాడు మామగారు.

"ఆ దినుసేమిటో చెప్పండి, మామగారూ!" అన్నాడు మాధవుడు.

"మరేమీ లేదు. అరిటాకుల మీద నూగు ఉంటుంది, చూశావూ? అది ముక్కాలువీశె సేకరించాలి. అందులో మరొక చిక్కేమిటంటే, ఆ నూగు పోగు చేసే చెట్లను నువే, నీ చేతిమీదుగా, మంత్ర సహితంగా నాటి పెంచాలి. ఆ మంత్రం నేను ఉపదేశిస్తాను," అన్నాడు మామగారు.

"చాలా చెట్లు నాటవలసి ఉంటుం దనుకుంటాను?" అన్నాడు మాధవుడు.



"సందేహమేమిటి? చాలా ఎకరాల తోట వెయ్యవలసి ఉంటుంది. లేకపోతే ముక్కాలువీసెడు నూగు ఎప్పటికి సంపాదించేటట్టు?" అన్నాడు మామగారు.

మాధవుడు పొలం కొని అరటితోట వెయ్యటానికి మామగారు ఆర్థికంగా సహాయం చేశాడు. కూలీలు భూమిని బాగు చేసి, అరటిమొక్కలకు గుంటలు తవ్వారు. మాధవుడు, మామగారు చెప్పిన మంత్రం చదువుతూ, అరటిమొక్క లన్నిటినీ స్వయంగా నాటాడు.

మొక్కలు ఎదిగి వచ్చాయి. మాధవుడు రోజంతా తోటలో తిరిగి ప్రతి ఆకు నుంచీ నూగు తీసేవాడు. రెండుమూడు రోజులు అలా తీసిన నూగు తూచిచూస్తే, తన మామగారు చెప్పిన మాటలు అక్షరాలా నిజమని అతనికి తోచింది. తొందరపడి ఏమీ లాభం లేదు. ఇలా ముక్కాలువీసె నూగు సంపాదించటానికి ఎంతో కాలం పట్టుతుంది. ఎంతో ఓపిక కూడా కావాలి.

మాధవుడి దృష్టి అంతా అరిటాకుల మీది నూగు పైనే ఉన్నది. అతని భార్య నిత్యమూ అరటిఆకులూ, గెలలూ, అరటి దూటా అమ్మి బోలెడంత డబ్బు వెనక వేస్తున్నది. వాటిని గురించి మాధవుడికి




గమనమే లేదు. అరటిఆకు నూగు ఎప్పటికి ముక్కాలువీసెడు అవుతుందా, ఎప్పుడు రాగిని బంగారంగా మార్చగలనా అన్న ధ్యాస తప్ప అతనికి మరో ధ్యాస లేదు.

మూడేళ్ళు గడిచినా మాధవుడి లక్ష్యం కనుచూపుమేరలో లేదు. కాని తోట మీద అతని భార్య సాగించే వ్యాపారం మూడు పువ్వులూ, ఆరుకాయలూగా ఉన్నది. బళ్ళ కొద్దీ అరటిగెలలూ, ఆకులూ, పూలూ, దూటా రవాణా అయి పోతున్నాయి. కొన్ని మైళ్ళమేర ఆ అరటితోటకు పోటీ లేదు.

మరో రెండేళ్ళు గడిచాయి. మాధవుడి దీక్ష ముగిసింది. అతను ముక్కాలువీసెడు

నూగు సేకరించాడు. అతను దాన్ని మామగారి ముందుంచి, "ఇదుగో, మామగారూ, మీరు చెప్పినంత నూగూ పోగుచేసి తెచ్చాను," అన్నాడు.

"భేష్, ఇక నీకు డబ్బులోటు ఉండదోయ్!" అంటూ మామగారు నవ్వాడు. ఆయన తన కుమార్తె కేసి తిరిగి, "అరటి తోట మీద నువ్వెంత సంపాదించావమ్మా?" అని అడిగాడు.

మాధవుడి భార్య డబ్బుసంచీ తెచ్చి, "మీరే లెక్క చూడండి." అన్నది. అరటి తోట మీద తన భార్య సంపాదించటమేమిటో మాధవుడికి అర్థం కాలేదు. అరటి తోట యొక్క ప్రయోజనం నూగు సంపాదించటమూ, దానితో రాగిని బంగారం చెయ్యటమూ అని మాధవుడు యింత కాలంగా అనుకుంటున్నాడు.

మామగారు సంచీని కుమ్మరించి, డబ్బులు ఎంచి, "ఇరవైవేల రూపాయలు!" అన్నాడు. ఆ డబ్బు కేసి చూసి మాధవుడు నిర్ఘాంతపోయాడు.

"నా సలహా ఎంత ఉపకరించిందో చూశావుటోయ్? కావలిస్తే ఈ వెండితో మేలిమి బంగారం కొనుక్కోవచ్చు. నగలూ, ఏనుగులూ, ఏది కావాలంటే అది కొనుక్కోవచ్చు. ఈ అయిదేళ్ళూ నీ చేత నేను చేయించిన శ్రమ ఫలించిందని ఒప్పుకుంటావు కాదూ? నువు చేసిన రసప్రయోగాల కంటె నయమేగద!" అన్నాడు మామగారు.

మాధవుడికి కళ్ళు తెరుపుడు పడ్డాయి. మామగారు తనను మోసం చేసినా, మంచి గుణపాఠం నేర్పాడు, ఎంతో లాభం కూడా కలిగించాడు. కామధేనువు లాంటి అరటి తోట ఉండగా తనకు డబ్బు లోటంటూ ఉండదు. అతను తన మామగారికి క్షమాపణతో బాటు కృతజ్ఞత కూడా తెలుపుకుని, భార్యతో సహా తోటవ్యాపారం చేసుకుంటూ సుఖంగా జీవించాడు.





# శిథిలాలయం

## 10

[శవరజాతి వాళ్ళను గాయపరిచి ఎలుగుబంటు అరణ్యంలోకి పారిపోసాగింది. కాని శిఖిముఖీ, నాగుమల్లీ దాన్ని కొంత పోరుజరిగాక, చంపారు. ఆ సమయంలో కొండ మీది నుంచి పూజారి కంఠం వినిపించింది. మరుక్షణంలో ఒక మానవాకారం ఎగురుతున్న పక్షిలా చేతులు చాచి చెట్లకొమ్మల మీదుగా కిందికి రాసాగింది. తరవాత—]

చెట్ల కొమ్మల్లోంచి తమ కేసి వస్తున్న వింత ఆకారాన్ని చూసి, శిఖిముఖీ, నాగుమల్లులు చాలా ఆశ్చర్యం పొందారు. ఆ ఆకారం చూడటానికి మామూలు మనిషిలాగే వుంది. కాని, పక్షిలా గాల్లో తేలియాడుతూ కిందకు దిగి రావటం వాళ్ళిద్దరికీ కొంత భయాన్ని కూడా కలిగించింది. ఇది శిథిలాలయ పూజారి తన మంత్ర ప్రభావంతో కల్పించిన పక్షి మనిషేమో అనుకున్నాడు, శిఖిముఖి. కాని, అంతలోనే అతడి అనుమానం పటాపంచలైంది. ఆ వింత మనిషి కాళ్లూ చేతులూ ఊపుతూ భూమికి పదీ పన్నెం డడుగుల ఎత్తులోకి వచ్చేసరికి, అతడి నడుముకు ఒక బలమైన మోకు కట్టివున్నట్టు శిఖిముఖి చూశాడు. అంటే, పూజారి కొండ మీద వుండి, యీ మనిషి నడుముకు తాడు కట్టి చెట్లల్లోంచి తమ ముందుకు జారుస్తున్నాడన్నమాట!






ఈ సంశయం కలగ్గానే శిఖిముఖి పెద్దగా నవ్వి, నాగుమల్లితో, "చూశావా, ఆ శిఖి లాలయ పూజారి మంత్రశక్తులు ఎంత మహత్తరమయినవో? మీ అయ్య అమాయకంగా అతడి దొంగమాటలు నమ్మి, మాతో విరోధం తెచ్చుకున్నాడు," అన్నాడు.

ఆ మాటలకు నాగుమల్లి కోపం తెచ్చుకుని, "మీ శబరవాళ్ళు తెలివిమంతులూ, మా సవరలు అమాయకులూ అనా నీవు అనేది? అందరూ మందబుద్ధులే! అసలు కావాలని మాతో విరోధం పెట్టుకున్నది, మీ జాతివాళ్ళు. మా అయ్య సంగతి..." అంటూ ఏమో చెప్పబోయేంతలో పక్షి మనిషి దభీమంటూ కింద పడ్డాడు. వాడి నడుముకు కట్టివున్న తాడు తెగిపోయింది.

నిలువునా నేల మీద పడిపోయిన పక్షి మనిషిని శిఖిముఖి, నాగుమల్లి పట్టుకుని కదిలించి చూశారు. కాని, వాడు శవంలా కొంచెం సేపు బిర్రబిగుసుకు పోయి, హఠాత్తుగా ప్రాణం వచ్చినవాడల్లే ఎగిరి గంతేసి నిలబడుతూ, "జై, పూజారి దేవా!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

"ఆ పూజారి, దేవుడు కాదురా, దయ్యం! ఇంతకీ నీ వెవడివి? ఆ దుర్మార్గుడి బంటువా? చెప్పు," అంటూ శిఖిముఖి వాడి మెడ పట్టుకుని వూపాడు.

"నేను గండభేరుండ పక్షి జాతివాణ్ణి. చుక్కలకంటా ఎగరగలను; ఈ భూప్రపంచాన్ని క్షణకాలంలో చుట్టి రాగలను," అంటూ వాడు గణాచారిలా వూగిపోసాగాడు.

"ఏ దేదో మూంచి తాగిన మైకంలో వున్నాడు. వీడి నుంచి మనం పూజారి సందేశం వినటం ఎలా సాధ్యం?" అంటూ శిఖిముఖి వాణ్ణి భుజాలు పట్టుకుని ఒక్క తోపు తోశాడు. ఆ తోపుకు వాడు పోయి ఒక చెట్టు బోదెకు కరుచుకుని, మెల్లిగా కూనిరాగాలు తీయసాగాడు.





అప్పటివరకూ జరుగుతున్నదంతా పరీక్షగా చూస్తున్న నాగుమల్లి చప్పున పక్షిమనిషి దగ్గిరకు పోయి, ఈటె తిప్పి వాడి భుజాన పొడుస్తూ, "నీవు సవరజాతి వాడివి కాదా? నీది తిమ్మగూడెమే కదా? గండుపోతు తెలుసా?" అని ప్రశ్నించింది.

గండుపోతు అన్న పేరు వింటూనే వాడు అదిరిపడి, "సవరగండుపోతా? అతడికి చావు తప్పదు. పూజారి దేవుడికి కోపం తెప్పించాడు. చూస్తూండు, రెండుమూడు రోజుల్లో పూజారి దేవుడు పంపే గండభేరుండం అతణ్ణి కోడిపిల్ల కింద తన్నుకుపోయి, ఏ కొండశిఖరానో పెట్టుకుని పొడుచుకు తినేస్తుంది," అన్నాడు.

"ఈ తిక్క తిక్క మాటలు కట్టిపెట్టు. నీవు తిమ్మగూడెం వాడివి, నాకు తెలుసు. నేను సవరపెద్ద గండుపోతు కూతుర్ని; నాగుమల్లిని. నీ పేరేమిటి?" అంటూ నాగుమల్లి ఈటె కర్రతో వాడి వెన్నుమీద బలంగా కొట్టింది.

ఆ దెబ్బతో వాడికి తిక్క సగం దిగిపోయింది. వాడు చప్పున తలతిప్పి నాగుమల్లి కేసి చూస్తూ, "నాగుమల్లివా? చెప్పవేం? నిన్ను పూజారి దేవుడు మహారాణిని చేస్తానంటున్నాడు—నా పేరా? పాతపేరు



ఏదో గుర్తు లేదు. పూజారి దేవుడు పిలిచే పేరు, సవర భేరుండం," అన్నాడు.

"నువ్వు సవర భేరుండానివి కాదు, చవట భేరుండానివి. ఆ దుర్మార్గుడేదో మందుమాకులు ప్రయోగించి నీ మతి చెడ కొట్టి నట్టుంది. లేకపోతే విప్పసారా అతిగా తాగి వుంటావు. అందుకే యింత సేపటి నుంచీ పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నావు. నీ కైపు దించి నిన్నిప్పుడే మామూలు మనిషిగా చేస్తాను," అంటూ శిఖిముఖి, భేరుండాన్ని నడుం పట్టుకు ఎత్తి భుజాన వేసుకుని, దాపులనున్న సెలయేటి దగ్గిరకు పరుగు పరుగున పోయి, విసిరి పడవేశాడు.





నీళ్ళల్లో పడుతూనే భేరుండం పెద్దగా ఓ చావుకేక పెట్టాడు. అతడికి తాను నీటి ప్రవాహాన పడి కొట్టుకు పోయి ఏ రాతికో తల తగిలి చస్తానన్న భయం కలిగింది. శిఖిముఖి అతణ్ణి నీటివాలు వెంట కొట్టుకు పోకుండా పట్టుకుని, తలను నీటిలో ముంచుతూ, "ఈ దెబ్బతో నీ మత్తు వదులుతుంది, తిరిగి మనిషివవుతావు," అన్నాడు పళ్ళు కొరుకుతూ.

శిఖిముఖి వాణ్ణి ఆ విధంగా నాలుగైదు సార్లు నీటిలో ముంచి ఎత్తేసరికి భేరుండం ప్రాణభయంతో తల్లగిల్లి పోతూ, "చంపకు నన్ను, మహారాజా! పూజారి దేవుడు పంపిన సందేశం వినండి, ఆ పటం చూడండి. మహారాణీ ఎక్కడ? కాపాడు, రక్షించు, మహారాణీ!" అంటూ అరిచాడు.

సెలయేటి ఒడ్డున నిలబడి యీ గొడవంతా చూస్తున్న నాగుమల్లి, భేరుండం మాటలకు విరగబడి నవ్వుతూ, "శిఖీ! వాణ్ణి చంపకు. నీ వైద్యంతో వాడికి ఉన్న కాస్త మతి కూడా పోయినట్టుంది. ఒడ్డున పడెయ్యి," అన్నది.

శిఖిముఖి ఆ మాటలతో కాస్త శాంతించి, గండభేరుండాన్ని నీటిలో నుంచి పైకెత్తి ఒడ్డుకు గిరవాటు వేశాడు. వాడు పడ్డ చోటునే ఆయాసపడుతూ లేచి కూర్చుని, "నన్ను దయ తలచండి. ఆకాశంలో ఎంతో దూరం నుంచి ఎగిరి వచ్చిన ఆయాసం, శ్రమా వల్ల ఏదేదో మాట్లాడాను," అన్నాడు వగర్చుతూ.

"ఏదో పటం అన్నావే, ఏమిటది?" అని ప్రశ్నించాడు శిఖిముఖి.

"ఆ మరిచాను, మహారాజా!" అంటూ గండభేరుండం దుస్తుల్లో నుంచి గుండ్రగా చుట్టివున్న చర్మాన్నొకదాన్ని బయిటికి తీసి, "ఇది మంచు జింక చర్మం. విప్పి చూడండి. మీరు పాలించబోయే రాజ్యపు సరిహద్దులూ, ఆ రాజ్యంలోని కొండలూ,



నదులూ, అరణ్యాలూ అన్నీ వుంటవి. మీరు వెంటనే బయలుదేరాలి. పూజారి దేవుడున్న చోటుకు తీసుకు పోతాను. తరవాత ఆయన మనందర్నీ ఆకాశమార్గాన బ్రహ్మపుత్రా నదీలోయలకు ఎత్తుకు పోతారు," అన్నాడు నవర భేరుండం.

శిఖిముఖీ, నాగుమల్లీ అతని మాటలేమీ పట్టించుకోలేదు. వాళ్ళు గుండ్రంగా చుట్టి వున్న జింకచర్మాన్ని విప్పి, దాని మీద రంగుల్లో చిత్రించివున్న అపూర్వ దృశ్యాలను చూస్తున్నారు. అందులో ఒక చోట శిథిలాలయం చిత్రించబడి వున్నది. దాని పక్కగా ఒక మహానదీ, కొండలూ, అరణ్యాలూ చిత్రితమయాయి. దూరంగా మంచుతో కప్పబడిన హిమాలయ పర్వతాలు కనిపిస్తున్నవి. శిఖిముఖీ, నాగుమల్లీ ఆ దృశ్యాలు చూస్తూ మైమరిచారు. వారినేదో అదృశ్య శక్తి ఒకటి ఆ సుందర ప్రాంతాలకు ఆహ్వానిస్తున్నట్టుగా తోచింది.

"శిఖీ! మనం యీ బొమ్మలో వున్న హిమాలయ ప్రాంతాలకు వెళదామా? పూజారి చెప్పే రాజూ, రాణీ మాటలు నేను నమ్మను. కాని, ఊరికే ఒకసారి అతడి వెంట వెళ్ళి, అద్భుతంగా వున్న ఆ కొండలూ అవీ చూసివద్దాం," అన్నది నాగుమల్లి.



శిఖిముఖి, ఆమె కేసి తలతిప్పి చూశాడు. నాగుమల్లి కళ్ళింత చేసుకుని, జింకచర్మం మీద చిత్రించబడ్డ దృశ్యాల కేసి చూస్తూ ఆనందపారవశ్యంలో మునకలు వేస్తున్నది. శిఖిముఖి ఏదో ప్రమాదాన్ని శంకించిన వాడిలా కనుబొమలు పైకెత్తి, తలాడిస్తూ, నాగుమల్లి భుజం మీద చేయివేసి, "మల్లీ! నువ్వీ లోకంలోనే వున్నావా? లేక శిథిలాలయ పూజారి మంత్ర ప్రభావానికి కట్టుబడి పోయావా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నతో నాగుమల్లి ఉలిక్కిపడి, "భేరుండానికి లాగే నాకూ మతిపోయినట్టుంది. ఆ దుర్మార్గుడైన పూజారి వెంట







ఆ బ్రహ్మపుత్రానది లోయల కేసి వెళ్ళటం ఏమిటి?" అన్నది, నొచ్చుకుంటున్నట్టు.

"నేనూ అదే అడగబోతున్నాను. వాడు మన శత్రువు .." అంటూ శిఖిముఖి ఆగి, సవర భేరుండం కేసి తల తిప్పి, "నువ్విక్కడే వుండు. నీ వెంట ఆ పూజారి దేవుడి దగ్గిరకొస్తాం," అని చెప్పి, నాగుమల్లిని కొంచెం దూరంగా తీసుకుపోయి, "ఆ శిథిలాలయ పూజారిని పట్టుకునేందుకు యిదొక అవకాశం. వాడు యీ ప్రాంతాల్లో చేసిన ఘోరాలు అన్నీ యిన్నీ కావు. గండ భేరుండం మాటలు నమ్మినట్టు నటించి, వాడి వెంట పూజారి దగ్గిరకు వెళదామా? ఒకసారి ఆ దుష్టుడు మన కంటబడితే, వాణ్ణి పట్టుకు బంధించటం ఏమంత కష్టం కాదు," అని చెప్పాడు.

నాగుమల్లి అందుకు సంతోషంగా అంగీకరించింది. ఆ వెంటనే శిఖిముఖి, గండభేరుండాన్ని సమీపించి, "ఇక పద, మీ పూజారి దేవుడి దగ్గిరకు దారితియ్యి," అన్నాడు.

గండభేరుండం ఆ మాటలు వింటూనే పరవశుడై పోయినట్టు గంతులు వేస్తూ, "రండి, రండి. కాబోయే మహారాజూ, మహారాణీలను పూజారిదేవుడికి పరిచయం చేయటం కన్న నాక్కావలసిం దేమున్నది? రాజ్యం వచ్చిం తరవాత, యీ సవర భేరుండాన్ని మాత్రం మరవకండి," అని చెట్లల్లోంచి కొండ మీదికి దారితీశాడు.

ఆ కొండప్రదేశ మంతా పెద్దపెద్ద వృక్షాలతో కప్పబడిపోయి వున్నది. భేరుండం ఆ ప్రాంత మంతా క్షుణ్ణంగా తెలిసినవాడి లాగా గబగబా నడవసాగాడు. శిఖిముఖి, నాగుమల్లీ చుట్టూ పరికించి చూస్తూ, ఆయుధాలు జాగ్రత్తగా పట్టుకుని వాణ్ణి అనుసరించారు.

ఒక పావుగంట గడిచింది. ఆ సరికి వాళ్ళు కొండ మీదికి చాలాదూరం ఎక్కారు. ఇప్పుడు భేరుండం ఏవో గుర్తుల కోసం



చూస్తున్నవాడిలా తల అటూ యిటూ తిప్పుతూ మెల్లిగా నడుస్తున్నాడు. శిఖిముఖీ, నాగుమల్లులు ఒక మహావృక్షం బోదెను చుట్టి ముందుకు పోయేంతలో, "నా బిడ్డల్లారా! వస్తున్నారా? అహ్హహ్హ!" అన్న శిథిలాలయ పూజారి వికృత కంఠధ్వని వినిపించింది.

ఇద్దరూ గతుక్కుమని తలలెత్తి పైకి చూశారు. వాళ్ళ కళ్ళకు భయంకొల్పే అద్భుత దృశ్యం ఒకటి కనిపించింది. వాళ్ళు కింద అరణ్యంలో చంపిన ఎలుగుబంటు చెట్లకొమ్మల మీదుగా—గాలిలో తేలుతూ పైకి పోతున్నది.

"శిఖీ! అది మనం చంపిన ఎలుగే! మెడ ఒక పక్కకు వేలాడవేసి వున్నది కనబడటం లేదా?" అన్నది నాగుమల్లి ఆశ్చర్యపడుతూ.

"తెలుస్తూనే వున్నది. దేని సాయంతో శిథిలాలయ పూజారి దాన్ని పైకి లాగుతున్నాడో అర్థం కావటంలేదు. ఓహో, భేరుండాన్ని మన ముందు దించినట్టు .." అని శిఖిముఖి ఏదో చెప్పబోయేంతలో, పై నుంచి పూజారి కంచుకంఠం గణగణమంటూ మోగింది:

"అవి తాళ్ళనుకుంటున్నావా? కాదు, కర్మపాశాలు! వాటికి బద్ధుడయ్యే, భల్లూకేశ్వరుడు నా దగ్గిర కొస్తున్నాడు; మీరూ నా దగ్గిర కొస్తున్నారు."

ఆ మరుక్షణంలోనే జుఁయ్ మంటూ రెండుమూడు బాణాలు చెట్లకొమ్మల మీదుగా పైకి దూసుకుపోయినై. దానితోపాటే విక్రమకేసరి గొంతు కూడా వినిపించింది: "శిఖీ! మల్లీ! ఆ పూజారి వున్న గుహ తెలిసింది. చుట్టుముట్టుదాం. ఇదుగో వస్తున్నాను."

శిఖిముఖీ, నాగుమల్లీ ఆ కంఠధ్వని వినవచ్చిన వైపుకు తలలు తిప్పి చూశారు. విక్రమకేసరి వేగంగా వాళ్ళ కేసి పరిగెత్తుకు వస్తున్నాడు. —(ఇంకావుంది)





# పట్టపరీక్ష

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ఓర్పు అసాధారణమైనది. నీవు పడుతున్న శ్రమలో నూరోవంతైనా పడకుండా పట్టపరీక్షలో నెగ్గి చంద్రపాలుడు కాంతిపుర సింహాసనాన్ని సాధించుకున్నాడు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు చంద్రపాలుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కాంతిపుర రాజైన కాలకంతుడికి సూర్యపాలుడూ, చంద్రపాలుడూ అని ఇద్దరు కొడుకు లుండేవారు. తగిన వయసు రాగానే వారిద్దరినీ విద్యాభ్యాసానికి రాజగురువు వద్దకు పంపారు. యుక్తవయస్కు లయే దాకా వాళ్ళు గురువు వద్ద నేర్చుకోదగిన

## బేతాళ కథలు





"నాకా మాట తెలియదా, మహారాజా? ఆచారాన్ని పాటించటం కన్న, రాజ్యక్షేమం ముఖ్యమని నా ఉద్దేశం. సూర్యపాలుడి పరిపాలనలో కంటె, చంద్రపాలుడి పరిపాలనలో రాజ్యం మరింత శ్రేయస్సు పొందుతుందని నా దృఢవిశ్వాసం. సూర్యపాలుడు దురహంకారి, దూరాలోచన లేనివాడు, ధైర్యశాలి అయినా కాడు. ఈ లోపాలేవీ చంద్రపాలుడిలో లేవు," అన్నాడు రాజగురువు.

"మీరన్న మాట నిజమే అయినట్టయితే వాళ్ళిద్దరికీ ఏదైనా పరీక్ష పెట్టటం మంచిదనుకుంటాను," అన్నాడు రాజు.

"ప్రత్యేకించి పరీక్ష పెట్టనవసరం లేదు. ఇద్దరినీ దేశసంచారం చేసి రమ్మనండి. తిరిగి వచ్చి వాళ్ళు తమ అనుభవాలు చెప్పినప్పుడు ఎవరు ఎటువంటి వారైనదీ మీకే తెలుస్తుంది," అన్నాడు రాజగురువు.

గురువును పంపేసి రాజు తన కుమారులతో, "మీ చదువు పూర్తి అయింది. మీలో పెద్ద వాడిని యువరాజుగా అభిషేకింతామని నేను అనుకున్నాను. కాని ఇంత కాలమూ మీకు గురువుగానూ, తండ్రిగానూ ఉంటున్న రాజగురువు నన్ను తొందర పడవద్దనీ, ఒక వారం రోజులపాటు మిమ్మల్నిద్దరినీ

విద్యలన్నీ నేర్చుకున్నారు. వాళ్ళ చదువు పూర్తి కాగానే రాజు గురువును సన్మానించి, తన కొడుకుల చదువు గురించి అడిగాడు.

"మహారాజా, మీరు త్వరలోనే మీ పెద్ద వాణ్ణి యువరాజుగా అభిషేకించబోతున్నారనుకుంటాను. గురువుగా నా అభిప్రాయమేమంటే, పెద్దవాడు రాజ్యార్హుడు కాడు. అందుకు రెండవవాడే తగినవాడు," అన్నాడు రాజగురువు.

రాజు నిర్ఘాంతపోయి, "అదేమిటి, గురుదేవా? పెద్దవాడికి కాదని చిన్నవాడికి పట్టం కట్టటం ఆచారవిరుద్ధమూ, సంప్రదాయ విరుద్ధమూ అయిన పనిగదా?" అన్నాడు.



దేశాటనకు పంపమనీ, మీరు తిరిగి వచ్చినాక మీలో ఎవరిని యువరాజుగా అభిషేకించాలో నిర్ణయించుకోమనీ అన్నారు. పూజ్యుడైన ఆయన మాట ప్రకారమే చేయదలిచాను. అందుచేత మీరు ఇవాళే బయలుదేరి, దేశం చుట్టి, మళ్ళీ వచ్చే ఈ వారానికి తిరిగి రండి," అన్నాడు.

ఈ మాటకు సూర్యపాలుడు రోషం తెచ్చుకుని, "నాకు రాజ్యాభిషేకం చెయ్యటం గురువుగారికి ఇష్టం లేకనే అలా అని ఉంటారు. యువరాజును కావలసిన వాణ్ణి ముమ్మాటికీ నేనే. అది ఇంకొక విధంగా జరగటానికి వీల్లేదు," అన్నాడు.

చంద్రపాలుడు కూడా అన్ననే సమర్థించాడు. అతను తండ్రితో, "మీ ఆజ్ఞ అయినట్టయితే మేమిద్దరమూ ఒక వారం పాటు దేశాటన చేసి వస్తాం, కాని మీ అనంతరం రాజు కావలసినవాడు అన్నే అవుతాడు గాని, నేను ఎంతమాత్రమూ కాను," అన్నాడు.

ఈ మాటతో సూర్యపాలుడు చాలా సంతృప్తి పడ్డాడు. ఆ రోజే అన్నదమ్ములిద్దరూ, తమ వెంట ఎవరూ లేకుండా కాలి నడకన దేశయాత్ర మీద బయలుదేరారు.

ఆ రాత్రి చాలా పొద్దుపోయి వారొక నదిని చేరుకున్నారు. నది దాటించే పడవవాడు





పడవలోనే పడుకుని నిద్రపోతున్నాడు. రాజకుమారులు వాణ్ణి లేపి, పడవలో నది దాటారు.

"వేళగాని వేళ పడవ నడిపాను. ఏదన్నా కానుక ఇప్పించండి," అన్నాడు పడవవాడు.

సూర్యపాలుడు వాడి కేసి చురచురా చూసి, "ఏంరా, నే నెవరనుకున్నావు? ఈ దేశపు యువరాజును. నన్నే కేవు అడుగుతావా? తాట ఒలిపించగలను," అంటూ పడవ దిగాడు.

అతని వెనకగా పడవ దిగుతున్న చంద్రపాలుడు పడవవాడికి ఒక వరహా ఇచ్చాడు.



మర్నాడు కొంత పొద్దెక్కాక రాజకుమారులు ఒక కొండ పక్కగా నడుస్తూండగా ఒక పెద్ద బండరాయి కొండ మీది నుంచి అతివేగంగా దొర్లుకుంటూ వారి కేసి వచ్చింది.

"అమ్మయ్యో!" అని సూర్యపాలుడు పెద్ద చావుకేక పెట్టాడు.

రాయి వచ్చే దారిలో ఒక దృఢకాయుడుండి, ఎంతో సాహసంతో ఆ రాతిని ఒక పక్కకు నెట్టాడు. రాజకుమారులకు ప్రమాదం తప్పింది.

సూర్యపాలుడు ఆ దృఢకాయుణ్ణి దగ్గిరికి పిలిచి, "నువు ఇవాళ ఎవరి ప్రాణాలు కాపాడావో తెలుసా? నేను ఈ దేశానికి యువరాజును, కాబోయే రాజును. ఫలాని రాజుగారి ప్రాణాలు కాపాడినవాడు మా పూర్వీకుడేనని నీ ముందు తరాలవాళ్ళు చెప్పుకుంటారు. నీకు సంఘంలో అంతులేని కీర్తి వస్తుంది. ఇక నీ దారిన పో," అని చెప్పి ముందుకు సాగాడు.

చంద్రపాలుడు ఆ దృఢకాయుణ్ణి పలకరించి, అతను చాలా పేదగా బతుకుతున్నాడని తెలిసి, "నీ వంటి ధైర్య సాహసాలు గలవాడు ఈ కొండల మధ్య అనామకుడుగా ఉండటం మంచిది కాదు. నా వెంట వచ్చి



నాకు అంగరక్షకుడి ఉద్యోగం చేస్తావా?" అని అడిగాడు.

దృఢకాయుడు అందుకు సంతోషంగా సమ్మతించి, చంద్రపాలుడి వెంట బయలు దేరాడు. చంద్రపాలుడు తన అన్నను కలుసుకుని, తమ ప్రాణాలను కాపాడిన వాడికి తన అంగరక్షకుడి పని ఇచ్చా నని చెప్పాడు.

"ఈ మాత్రం సహాయం చేసినందుకేనా? మన ప్రాణాలు కాపాడటంలో అతను తన ధర్మాన్ని నిర్వర్తించాడు. అందుకోసం ప్రత్యుపకారం చెయ్యటం అనవసరం," అన్నాడు సూర్యపాలుడు.

"నేనా మాట ఆలోచించనే లేదు. కొండ మీదినుంచి దొర్లి వచ్చే బండరాయిని పక్కకు నెట్టటానికి ఎంత సాహసమూ, ఎంత బలమూ కావాలో ఆలోచించావా? మనం రాజకుమారులమని తెలిసి అతను మనని కాపాడ లేదు. నేను చేస్తున్నది ప్రత్యుపకారం ఏ మాత్రమూ కాదు. ఇంతటి సాహసీ, బలాఢ్యుడూ నాకు అంగరక్షకుడుగా ఉండటం నాకే ఉపకారం. నూరేళ్ళు ప్రపంచం గాలించినా ఇటువంటివాడు దొరకడు," అన్నాడు చంద్రపాలుడు.

అప్పటిదాకా సూర్యపాలుడికి ఆ బలాఢ్యుడి సాహసమూ, బలమూ అర్థం








సూర్యపాలుడు కంగారుపడి కాలిసత్తువ కొద్దీ పారిపోయాడు.

చంద్రపాలుడు మాత్రం అక్కడే నిలబడి ఆ సింహాన్ని శ్రద్ధగా గమనించసాగాడు. అది గర్జించలేదు. దానిలో ఏ విధమైన వికారమూ ఉన్నట్టు కనిపించలేదు. అది చంద్రపాలుణ్ణి సమీపించి, అతని ముందు ఆగింది. అతను వంగి దాని శరీరంలో గుచ్చుకున్న రెండు బాణాలనూ లాగేసి, గాయాలను చేత్తో గట్టిగా రుద్దాడు. కృతజ్ఞత చూపిస్తున్న దాని లాగా సింహం అతని చేతిని నాకింది.

"ఈ సింహం మనదే దొరా! వెంట తీసుకుపోదాం," అన్నాడు బలాఢ్యుడు. వాడు అన్నట్టుగానే ఆ సింహం చంద్రపాలుడి వెంట కుక్క లాగా వచ్చింది.

సింహాన్ని చూసి పారిపోయిన సూర్యపాలుడు తన తమ్ముడి కన్న ఒక ఘడియ ముందుగా ఇల్లు చేరుకుని, దారిలో తమకు జరిగిన అనుభవాలన్నీ చెప్పి, "నాలాగే తమ్ముడు కూడా పారిపోయి వచ్చేసి ఉండవలసింది. ఆ సింహం వాణ్ణీ, వాడి అంగరక్షకుణ్ణీ తినేసే ఉంటుంది. నా యువరాజ్యాభిషేకానికి వాడు నా వెంట ఉంటాడని ఎంతో ఆశించాను," అని పెద్దగా నిట్టూర్పు విడిచాడు.

కానేలేదు. ఆ సంగతి ముందు గ్రహించి ఉంటే ఆ మనిషిని తానే తన అంగరక్షకుడుగా నియమించుకునేవాడే. ఇప్పుడు అవకాశం జారిపోయింది.

తరవాత వారొక అరణ్యం ప్రవేశించారు. అందులో కొంతదూరం వెళ్ళాక దూరాన వారికొక సింహం కనిపించింది. దాన్ని చూస్తూనే సూర్యపాలుడు తన బాణాలు తీసి వేగంగా దాని పైన విసిరాడు. వాటిలో చాలా భాగం గురి తగల లేదు. ఒకటి రెండు బాణాలు తగిలినా లక్ష్యపెట్టక సింహం తాపీగా నడుచుకుంటూ రాజకుమారుల కేసి వచ్చింది.



సరిగా అదే క్షణంలో చంద్రపాలుడు తన అంగరక్షకుణ్ణీ, సింహాన్నీ వెంటబెట్టు కుని వచ్చాడు. ఆ సింహం తన కేసి కోపంగా చూస్తున్నట్టు కనిపించేసరికి సూర్యపాలుడు కంపరం పుట్టి, లోపలికి పారిపోయాడు.

తరవాత రాజు తన కొడుకుల నిద్దరినీ పిలిపించి, యౌవరాజ్యాభిషేకం మాట ప్రస్తావించినప్పుడు సూర్యపాలుడు, "తమ్ముణ్ణే యువరాజుగా అభిషేకించండి," అనేశాడు. అతని ఇష్టానుసారమే రాజు తన రెండో కొడుకును యువరాజుగా అభిషేకించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, అంత దురహంకారి అయిన సూర్యపాలుడు తనంతట తానే తన తమ్ముడికి రాజ్యం దక్కటానికి ఎందుకు సమ్మతించాడు? అతని వద్ద ఒక బలాఢ్యుడైన అంగరక్షకుడూ, సింహమూ ఉన్నాయనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సూర్యపాలుడు సింహాసనం మీద ఆశ వదులుకోవటానికి ఇవేవీ అసలైన కారణాలు కావు. తాను సింహాన్ని చూసి పారిపోయి రావటం రాజభవనంలో అందరికీ తెలిసింది. ఆ మచ్చ పెట్టుకుని అతను రాజభవనంలో ఎవరినీ మెప్పించలేడు. తాను రాజైనప్పుడు తన తమ్ముడు తన ప్రజలలో ఒకడవుతాడు. అతనే ఆ సింహాన్ని వెంట తెచ్చినవాడు. తన కన్న ధైర్యవంతుడని రుజువయిన వ్యక్తి మీద ఏ రాజూ అధికారం చలాయించలేడు. అందుచేత సూర్యపాలుడు సింహాసనాన్ని త్యాగం చెయ్యటం తప్పనిసరి అయింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)






# నాలుగు పిశాచాలు

ఒక గ్రామం చివర ఒక పాత సత్రం ఉండేది. అందులో పిశాచా లుంటాయనీ, రాత్రివేళ ఎవరైనా ఆ సత్రంలో ఉంటే వాళ్ళను చంపేస్తాయనీ ప్రతీతి ఉండేది.

ఆ ఊళ్ళోనే నల్లమందుభాయి ఒకడుండే వాడు. వాడు చిలుములో నల్లమందు వేసి పీల్చి, ఆత్మానందంలో మునిగి తేలుతూ ఉండేవాడు. నల్లమందు కొనటానికి డబ్బు లేనప్పుడు మాత్రమే వాడు ఏదైనా పని చేసే వాడు; చేసిన పనికి కూలిడబ్బులు చేతిలో పడగానే వెళ్ళి నల్లమందు కొని, దాన్ని తన చిలుము గొట్టంలో వేసి పీల్చి, తిరిగి ఆనంద సాగరంలో తేలిపోయేవాడు.

ఒకనాటి సాయంకాలం వేళ వాడి దగ్గిర ఉన్న నల్లమందంతా అయిపోయింది. కొందామంటే దగ్గిర డబ్బు లేదు. ఎక్కడ నైనా పని ఏదన్నా చేతామన్నా ఎటూగాని సమయమయింది. అందుచేత వాడు వీధిన పడి, అందరినీ పీడించసాగాడు: "నా చిలుముకు ఇంత నల్లమందు ఇప్పించండి, మీరేది చెయ్యమంటే అది చేస్తాను."

ఎవరూ వాడి మొర ఆలకించ లేదు. కాని కొందరు కుర్రాళ్ళు వాణ్ణి ఏడిపించా లనుకుని, "ఒరే, నువ్వీరాత్రి సత్రంలో గడిపావంటే నీ చిలుములో నల్లమందు వెయ్యటమేగాక, నీకు భోజనం కూడా పంపిస్తాం," అన్నారు.

నల్లమందు ఇచ్చినట్టయితే వాడు ఆ రాత్రి కాలాన్నంతా నరకంలో గడపమన్నా గడుపుతా నన్నాడు.

యువకులు తమలోతాము నవ్వుకుని, నల్లమందుభాయి చిలుము నిండా నల్ల మందు నించి, రాత్రికి భోజనం కూడా మూట గట్టి ఇచ్చారు. తరవాత వాళ్ళు వాణ్ణి సత్రం దాకా తీసుకుపోయి, లోపలికి పంపి, తమ దారిన తాము వెళ్ళిపోయారు.

ఎ. ఉమాపతి

నల్లమందుభాయి ఆసనశుద్ధిగా సత్రంలో కూర్చుని నల్లమందు అంటించి, తాగ నారంభించాడు. త్వరలోనే వాడు ఆత్మా నందంలో మునిగిపోయాడు. వాడి బుర్రలో పిశాచాల ఆలోచనే లేదు.

సరిగా అర్ధరాత్రి వేళ నాలుగు పిశాచాలు నిశ్శబ్దంగా సత్రం ప్రవేశించాయి. తన్మయత్వంలో ఉన్న నల్లమందుభాయి కళ్ళు మూసుకుని ఉండటంచేత వాటిని గమనించనుకూడా లేదు.

ఎవడో ఆ రాత్రివేళ సత్రంలో ఉండటమే పిశాచాలకు ఆశ్చర్యమయింది. వాడు తమను చూసి బెదిరి పారిపోక పోవటంతో వాటి ఆశ్చర్యం రెట్టింపయింది. అవి ఇంకా దగ్గిరికి వచ్చి వాడి ముఖంలో ముఖాలు పెట్టాయి. అప్పటికీ వాడు కళ్ళు తెరవలేదు.

అంతకన్న కూడా అద్భుతం ఒకటి పిశాచాల కంట బడింది: ఆ మనిషి ఎటువంటి మనిషోగాని వాడు నిప్పు మింగుతున్నాడు! ఇది చూసి పిశాచాలు కొద్దిగా బెదిరి, వాడికి ఎడంగా జరిగాయి.

ఇంతలో నల్లమందుభాయికి ఆకలి పుట్టుకొచ్చింది. వాడు కళ్ళు మూసుకునే తన పక్కన ఉన్న మూట తీసుకుని తడివి చూశాడు. వాడి చేతికి ముందుగా కాజాలు



తగిలాయి. "ఒరే బక్కవాడా! నిన్ను ముందు తింటారా!" అన్నాడు నల్లమందుభాయి.

తరవాత వాడి చేతికి లడ్డూ తగిలింది. "ఓరి గుండుగాడా! నువ్వూ ఉన్నావా? నిన్ను తరవాత తింటాను," అన్నాడు వాడు.

ఆ తరవాత వాడికి కోడిగుడ్డు తగిలింది. "నువ్వు కూడా ఉన్నావా, బట్టతలవాడా? నిన్ను ఒక్క గుక్కన మింగేస్తా!" అన్నాడు వాడు. చిట్ట చివరకు వాడి చేతికి సేమ్యా లాటిది తగిలింది. "ఒరే పీచూ, నీ పని చివరకు చెబుతారా! నిన్ను నమిలి నమిలి తింటా!" అన్నాడు నల్లమందుభాయి.

దురదృష్టవశాత్తూ, నల్లమందుభాయి నోట వచ్చిన "బక్కవాడు," "గుండు గాడు," "బట్టతల," "పీచుగాడు" అన్న మాటలు ఆ పిశాచాల పేర్లు. మిగిలిన పిశాచాలు వాటిని అ పేర్లతోనే పిలిచేవి.

నల్లమందుభాయి పైకి అన్న మాటలు విని పిశాచాలు హడిలిపోయాయి.

"వీడు మామూలు మనిషి కాడు. మామూలు మనిషైతే ఈ సత్రంలో రాత్రి వేళ చేరటానికి ఎన్ని గుండెలుండాలి? అదీగాక వీడు నిప్పు మింగేస్తున్నాడు. అంతే గాక వాడు మనందరి పేర్లూ తెలుసుకున్నాడు. వీడు మనని తినటానికే వచ్చాడు. వీణ్ణి మంచి చేసుకోవటం తప్ప మరో మార్గం లేదు," అని పిశాచాలు నిశ్చయించుకున్నాయి. ఎక్కడ బంగారం పాతి పెట్టి ఉన్నదీ వాటికి తెలుసు. అందుచేత అవి వెళ్లి, ఆ బంగారాన్ని తవ్వి తెచ్చి, నల్లమందుభాయి ముందు పోసి, "అయ్యా, బాబూ! ఇది తీసుకో. మా జోలికి మాత్రం రాకు," అన్నాయి.

నల్లమందుభాయి మత్తుగా కళ్లు సగం తెరిచి, ఎవరో బంగారంతో తన ఆహారాన్ని కొనటానికి ప్రయత్నిస్తున్నారనుకుని, "అదేమీ కుదరదు. నాకు చచ్చే ఆకలిగా ఉంది. అరుసూరైనా నా తిండి నేను తిని తీరాలి!" అన్నాడు.

పిశాచాలకు పై ప్రాణాలు పైనే పోయాయి. అవి ఆ బంగారాన్ని అక్కడే వదిలేసి, వాయువేగంతో పారిపోయాయి. అవి అలా ఎంతదూరం పారిపోయాయో, ఎక్కడ ఆగాయో మనకు తెలీదు. అటు తరవాత ఆ సత్రంలో పిశాచాలున్నట్టు ఎవరూ చెప్పుకోలేదు. నల్లమందుభాయి మటుకు, శరీరశ్రమ లేకుండా, చెయ్యి చాచి ఒకరిని అడగకుండా, బతికున్నంత కాలమూ నల్లమందు సేవిస్తూ ఆత్మానందంలో ఓలలాడాడు.





# చపలచిత్తపురాజు

ఒకప్పుడు నాగపాలుడు అనే రాజుండే వాడు. అతను బొత్తిగా చపలచిత్తుడు. అతను తన మంత్రులూ, హితైషులూ చెప్పే సలహాలను లక్ష్యపెట్టక తనకు తోచినదెల్లా చేసేవాడు. అతని ఆజ్ఞలను పాలించలేక అతని మంత్రి దేవరాజు నానా అగచాట్లూ పడేవాడు. ఎందుకంటే నాగపాలుడు అసాధ్య మైనవీ, అసంభవమైనవీ కోరుతూండేవాడు.

దేవరాజు గొప్ప మేధావీ, జ్ఞానీ, బహు ముఖ శాస్త్రపరిజ్ఞానం కలవాడూ కావటం చేత నాగపాలుడితో వేగుకొస్తున్నాడు. రాజు గారి ప్రధాన అంగరక్షకుడైన శివసేనుడు దేవరాజుకు కుడిభుజంగా ఉండేవాడు. రాజుగారి గొంతెమ్మ కోరికలు తీర్చటంలో అతను దేవరాజుకు కొంత సహాయపడుతూ ఉండేవాడు.

ఉదాహరణకు, ఒకనాడు రాజుగారు తన మంత్రిని పులిపాలు తెమ్మన్నాడు. అప్పుడు శివసేనుడు ఎనిమిదివందల మంది భటులతో అరణ్యానికి వెళ్లి, ఈనిన ఆడ పులి కోసం మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ వెతికి, చివరకు అలాటి పులిని వలవేసి పట్టి తెచ్చాడు. దాని కాళ్ళూ, నోరూ దృఢంగా బంధించి, రాజుగారి సమక్షంలో భటుల చేత దాని పాలు పితికించాడు మంత్రి.

ఒకనాడు రాజు మంత్రితో, "కిందటి రాత్రి నాకు ఒక విచిత్రమైన కల వచ్చింది. అందులో ఒక యోగి రాజభవనానికి వచ్చి, ఒక వింత చూపాడు. అదేమిటంటే, బూడిద తాడుకు ఒక ఉంగరం వేళ్ళాడు తున్నది. తాడు తెగలేదు, ఉంగరం కింద పడిపోలేదు. అది కలే అనుకో. కాని ఆ యోగినీ, ఆయన చూపిన వింతనూ కళ్లారా చూడాలని ఉంది. వెంటనే వెళ్లి, మూడు రోజుల లోగా అందుకు తగిన ఏర్పాట్లన్నీ

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



పూర్తిచెయ్యి. లేకపోతే నీ తల తీసేయి స్తాను," అన్నాడు.

దేవరాజు దీర్ఘాలోచనలో మునిగిపోయి ఆ రాత్రి నిద్రపోలేదు. మర్నాడు తెల్ల వారింది. రాజుగారి కోరిక నెరవేర్చటాని కింకా రెండు రోజులే వ్యవధి ఉన్నది. ఈ లోపల ఆయన కోరినది సిద్ధించకపోతే తన తల ఎగిరి పోతుంది. కాని, రాజుగారి కోరిక తీర్చేటందుకు ఎలాటి ఉపాయమూ దేవరాజుకు తట్టలేదు.

రెండోరోజు మధ్యాహ్నం ఆయన కొక ఆలోచన వచ్చింది. రాజుగారు కోరిన ప్రదర్శన ఇవ్వటానికి ఇంద్రజాలం తప్ప మరొక మార్గం లేదు. అందుచేత ఆయన తన పుస్తకాలలో నుంచి ఇంద్రజాల గ్రంథాన్ని తీసి, పేజీలు తిప్పసాగాడు. త్వరలోనే ఆయనకు కావలసింది దొరికింది.

ఆ సాయంకాలం లోపల ఆయన చేయ వలసిన ఏర్పాట్లన్నీ చేసుకుని, మర్నాడు ఉదయం ఒక యోగిని వెంటబెట్టుకుని, రాజసభకు వెళ్ళాడు.

"మహారాజా, వీరు మౌనానందస్వామి వారు. మాట్లాడరు. మీరు కలలో చూసిన వింతను వీరు మీకు ప్రత్యక్షంగా చూపు తారు. మీరు దయచేసి వారిని ఇంకే ఇతర కోరికా కోరకండి," అని దేవరాజు నాగపాలుడితో అన్నాడు.

రాజు అందుకు సమ్మతించాడు. యోగి లేచి నిలబడి ఒక దారం పైకి తీశాడు. ఆయన దాని ఒక చివరను ఒక కర్రపుల్లకు కట్టి, దారం రెండో చివరను ఒక ఉంగరం వేళ్ళాడగట్టాడు.

యోగి సంజ్ఞ చెయ్యగానే దేవరాజు దారా నికి నిప్పుపుల్ల వెలిగించి పెట్టాడు. సభికు లంతా చూస్తూండగా దారం పూర్తిగా కాలి పోయి బూడిద అయింది. కాని దారం ఆకారం మారలేదు. దానికి వేళ్ళాడగట్టిన ఉంగరం పడిపోనూలేదు.

రాజూ, సభికులూ ఉత్సాహంతో హర్ష ధ్వానాలు చేశారు. రాజు యోగికి మంచి బహుమానాలు కూడా ఇచ్చాడు. దేవరాజు తలకు గండం తప్పిపోయింది.

ఆ రోజు మధ్యాన్నం శివసేనుడు దేవరాజు ఇంటికి వచ్చి, "నేను నా పాత్ర సరిగానే నిర్వహించానా?" అన్నాడు.

దేవరాజు నవ్వి, "సరిగా నిర్వహించావు గనకనే నువ్వూ, నేనూ ఇంకా ప్రాణాలతో ఉన్నాం. యోగి వేషంలో నిన్నెవరూ గుర్తించలేదు," అన్నాడు.

"ఈ గారడీ చెయ్యడానికి ముందు మీరు దారాన్ని ఉప్పు నీటిలో ఎన్నిసార్లు నాన్చి ఆరబెట్టారు?" అని శివసేనుడు అడిగాడు.

"మూడుసార్లే. నీటిలో ఉప్పు బాగా దండిగా కలిపాను. అందులో దారాన్ని నాన్చి ఆరబెట్టాను. అలా మూడుసార్లు చేసిన మీదట దారం కాల్చినప్పటికీ దాని ఆకారాన్ని నిలబెట్టుకోవటమే గాక ఒక తేలిక ఉంగరాన్ని మోయగలిగింది. మన అదృష్టం బాగుందని చెప్పాలి. గట్టిగా గాలి వీచింది కాదు. అలా జరిగినట్టయితే మన ఆట కట్టయేది. అందుకే రాజుగారికి వేసే వింజామరలను కూడా నిలిపివేయమన్నాను. మొత్తం మీద ఈ ఇంద్రజాలం ఇవాళ నా ప్రాణాలను కాపాడింది. మన రాజుగారి చపలచిత్తాన్ని సరి చెయ్యాలంటే నేను ఇంద్రజాలం పైన హెచ్చుగా ఆధారపడటం అవసరమని తోస్తుంది," అన్నాడు దేవరాజు.

ఈ ట్రిక్కును మనం ఎవరమైనా చెయ్యవచ్చు. ఇతరులకు చేసి చూపే ముందు మనం తయారు చేసిన దారాన్ని పరీక్షించుకోవటం మంచిది. దారం కాలి బూడిద అయాక గాలికి తట్టుకో లేదు. అందుచేత ఈ ట్రిక్కును ఫాన్‌ల కింద చెయ్యరాదు.





# వింత సమస్య

ఒకనాడు ఒక రాజుగారు తన మంత్రినీ, పండితులనూ దగ్గిర కూర్చో బెట్టుకుని విద్వద్గోష్ఠిలో ఉండగా అక్కడికి ఒక యువతి వచ్చి, రాజుగారికీ, సభకూ నమస్కారం చేసి, "మహారాజా, ఇక్కడ ఇంతమంది పండితులూ, మేధావులూ ఉన్నారు. నాకొక సమస్య వచ్చింది. దాని పరిష్కారం ఎలాగో తెలిపి పుణ్యం కట్టుకోగలరా?" అని వినయంగా వేడుకున్నది.

"చెప్పమ్మా, నీకు వచ్చిన సమస్య ఏమిటి?" అన్నాడు రాజుగారు, ఎంతలేసి సమస్యలనైనా ఇట్టే పరిష్కరించగలమన్న ధీమాతో నవ్వుతూ. ఆయన చుట్టూ చేరిన పండితులు చిరునవ్వు నవ్వి, ఆ యువతి కేసి చూశారు; ఏమిటా ప్రశ్న అన్నట్టు.

"నేను బ్రాహ్మణ యువతిని. మాది ఒక గ్రామం. మా తండ్రి గొప్ప వేద పండితుడు. మేం ప్రస్తుతం ఈ రాజధానిలోనే ఉంటున్నాం. ఈ మధ్యనే మా తండ్రిగారు నాకు వివాహం చేయసంకల్పించి, ఒక యువకుణ్ణి పెళ్ళి చూపులకు పిలిచారు. నా ముందుపిల్ల లిద్దరూ వరుడు చాలా అందంగా ఉన్నాడనీ, తప్పక పెళ్ళాడమనీ నన్ను వేధిస్తున్నారు. నా ఎడపిల్ల లిద్దరూ కూడా వరుడి మాటలకు ముగ్ధులై నన్ను తప్పక అతన్నే పెళ్ళాడమంటున్నారు. కాని మావారు మాత్రం ఎటూ తేల్చక, ఎందుకో శంకిస్తున్నారు; ఈ పెళ్ళికి ఒక పట్టాన సమాధానపడకుండా ఉన్నారు. ఇంకో పక్క నా తండ్రిగారి ప్రోద్బలం హెచ్చుగా ఉన్నది. ఈ పరిస్థితిలో నేనీ పెళ్ళికి ఒప్పుకోవాలో, మానాలో తేల్చుకోలేక తికమక పడుతున్నాను. నా మెదడంతా మొద్దుబారిపోయింది. ఇక్కడ ఇంతమంది పండితులూ, జ్ఞానులూ ఉన్నారు. దయచేసి నాకు సరిఅయిన

అజ్జరపు హనుమంతరావు

సలహా ఇవ్వండి!" అని ఆ యువతి అందరికీ ఒక నమస్కారం చేసింది.



రాజూ, పండితులూ కూడా ఆమె మాటలకు నిర్ఘాంతపోయారు. ఆమె చూస్తే వివాహయోగ్యమైన వయసులోనే ఉన్నది. కాని తనకొక భర్తా, నలుగురు పిల్లలూ ఉన్నట్టు చెబుతున్నది. గొప్ప శ్రోత్రియుడైన తండ్రి తనను వివాహం చేసుకోమని నిర్బంధిస్తున్నాడంటున్నది. ఆమె మాటలు వట్టి అబద్ధాలైనా కావాలి, లేదా ఆమె తప్పించుకుని పారిపోయి వచ్చిన పిచ్చిదైనా అయివుండాలి.

ఆమె తమకు అవమానం చేసినందుకు ఆగ్రహించాలో, లేక అర్థంలేని ఆమె మాటలకు నవ్వాలో తేల్చుకోలేక పండిత ప్రకాండులంతా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. రాజు పండితుల ముఖాలను పరీక్షగా చూసి, వాళ్ళకూ ఆ యువతిని గురించి తనకు కలిగిన అనుమానాల లాటివే కలిగినవని గ్రహించి, తల తిప్పి తన మంత్రి కేసి చూశాడు.

మంత్రి చిరునవ్వు నవ్వి లేచి నిలబడి, "అమ్మా, నువు బాగా చదువుకుని, సంస్కారం గల దానివిలా కనిపిస్తున్నావు. పిల్లలు అమాయకులు. వారి మాటల కేం? వారు పై చూపులకు మోసపోవచ్చు. కాని మీ ఆయనకు మంచి యుక్తాయుక్త విచక్షణ ఉన్నట్టు నేను గ్రహించాను. అందుచేత మిగిలిన వేవీ పాటించక, అతను చెప్పినట్టే చెయ్యి. అతణ్ణి తృణీకరించి ఏదైనా చేశావో, సంసారం బాగుంటే చిక్కుండదు గాని, లేని పక్షంలో ఆయనకు నువే జవాబు దారువు గద!" అన్నాడు.

ఆ యువతి మంత్రితో, "మహా మంత్రీ, మీరు చెప్పిన పద్ధతే నేననుకున్నదీ ఒకటే అయింది. నాకు ఊతం ఇచ్చినందుకు మీకు ఎంతైనా కృతజ్ఞురాలిని!....మహా రాజా, నాకు సెలవిప్పించండి!" అంటూ

ఆమె సభకంతకూ ఒక నమస్కారం చేసి వెళ్లిపోయింది.

ఆ యువతి మాటలు ఎంత అయోమయంగా ఉన్నాయో, మంత్రి మాటలు కూడా సభలోని పండితులకు అంత అయోమయంగానూ ఉన్నాయి.

రాజు మంత్రి కేసి తిరిగి, "ఆమె ఏమి అడిగింది? నువ్వేమి చెప్పావు? మా కేమీ అంతు చిక్కలేదే?" అన్నాడు.

అప్పుడు మంత్రి ఇలా అన్నాడు :

"ఆమె చాలా తెలివైనది. తన సమస్య సూటిగా చెప్పటానికి బిడియపడిందో ఏమో, వ్యంగ్యంగా చెప్పింది. ఆమెకు పెళ్ళి చేయగోరి ఆమె తండ్రి ఒక యువకుణ్ణి పెళ్లి చూపులకు తెచ్చాడన్నది స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. పెళ్ళికొడుకును ముందుపిల్ల లిద్దరూ చూసి మెచ్చుకున్నారన్నది. ముందుపిల్లలంటే ఆమె కళ్ళు. ఆ యువకుడు అందంగా ఉన్నాడని అర్థం. ఎడపిల్ల లంటే చెవులు. అవి కూడా పెళ్లి కొడుకును ఆమోదించాయంటే ఆ యువకుడు మధురభాషి అన్నమాట. సంకోచిస్తున్నది తన భర్తట—అంటే ఆమె మనస్సు. ఆమెకు వచ్చిన సమస్య ఏమిటంటే, వరుడి రూపురేఖలూ, మాటలూ విని తృప్తిపడి పెళ్ళాడటమా, వరుడు తన మనస్సుకుకూడా నచ్చినదాకా వేచి వుండటమా అని. మనస్సుకు నచ్చిన తరవాతనే పెళ్లాడమనీ, అలా కాకుండా పెళ్ళాడిన మీదట సంసారం సరిగా నడవకపోతే, బతికున్నంత కాలమూ తన అంతరాత్మ సూటిపోట్లకు గురికావలసి వస్తుందనీ, నేను హెచ్చరించాను. ఆమె అలాటి ఆలోచనలో ఉండబట్టే మన దగ్గిరికి వచ్చింది. నే నామె ఆలోచనను బలపరచటం చేత ఆమె తృప్తిపడి వెళ్లిపోయింది."

మంత్రి తెలివితేటలకు పండితులందరూ ఆశ్చర్యపోయారు.





# బటానీగింజ

ఒక నగరంలో ఆనందు డనే పనిలేని వాడొకడుండేవాడు. గాలికి తిరిగే ఆనందు డికి ఒకనాడు దారిలో ఒక బటానీగింజ దొరికింది. వాడు దాన్ని ఏరుకుని ఇలా ఆలోచనలో పడ్డాడు:

"ఈ బటానీగింజను పాతితే బటానీ మొక్క మొలిచి, బోలెడు బటానీలు కాస్తుంది. వాటన్నిటినీ మొలిపిస్తే, బోలెడన్ని బటానీమొక్కలు మొలిచి, అంతులేని బటానీ గింజలు కాస్తాయి. వాటన్నిటినీ పొలంలో వేసి పంట చేస్తే పుట్లకొద్దీ బటానీలు! వాటన్నిటినీ ఎక్కడ అమ్మేట్టు! దేశాంతరాలకు రవాణా చెయ్యవలిసిందే. తప్పదు. కాని రవాణాకు కనీసం పన్నెండు ఓడలయినా కావాలే. ఎలా? రాజుగారిని అడగటం తప్ప మరొక మార్గం లేదు."

ఆలోచన ఇక్కడి దాకా వచ్చాక ఆనందుడు తిన్నగా రాజుగారి దగ్గిరికి బయలుదేరాడు. దారిలో అతడికి ఒక రాక్షసుడు అడ్డుతగిలి, "ఏయ్, ఎక్కడికి పోతున్నావు?" అని అడిగాడు.

"సముద్రం మీద సరుకు రవాణా చెయ్యాలి. రాజుగారిని పది, పన్నెండు ఓడలు అరువు అడగబోతున్నాను," అన్నాడు ఆనందుడు.

"ఈ పక్కన ఉన్న కోట చూశావా? ప్రస్తుతం ఇది నాదే. మూడురోజులు దాటాక నేను రాజుగారి ఇంటికి వచ్చి నిన్ను మూడు పొడుపుకథ లడుగుతాను. వాటిని నువు విప్పినట్టయితే ఈ కోటా, అందులో వున్న నిధులూ నీ వవుతాయి. ఎందుకంటే, నువు నా పొడుపుకథలు విప్పగానే నేను పొట్టపగిలి చచ్చిపోతాను. అది నాకు శాప విమోచనం. కాని నువు నా కథలు విప్ప లేకపోతే నేను నిన్ను తినేస్తాను," అన్నాడు రాక్షసుడు.

ఆర్. భవానీప్రసాద్





ఆ మాట విని రాజుగారు సందేహంలో పడి, ఈ ఆనందుడు నిజంగా కోటీశ్వరుడవునో కాదో పరీక్షించాలని నిశ్చయించుకున్నాడు. ఆయన ఆ రాత్రికి ఆనందుణ్ణి తన అతిథిగానే ఉండిపొమ్మని, అతను పడుకోవటానికి ఉండలుకట్టిన పరుపూ, దాని మీద చిరుగుల దుప్పటీ వేయించి, కప్పుకునేటందు కొక చిరుగుల బొంత ఏర్పాటు చేయించి, అతను ఆ పక్క మీద ఎలా నిద్రపోతాడో కనిపెటమని ఒక నౌకరును పురమాయించాడు.

ఆ నౌకరు మర్నాడు పొద్దున రాజుగారి దగ్గిరికి వచ్చి, "ఆ బాబు తెల్లవార్లూ నిద్రపోతే ఒట్టు! ఎప్పుడు చూసినా పక్క మీద లేచి కూర్చుని పక్కంతా తడువుకుంటూనే ఉన్నారు," అన్నాడు.

రాజుకు సగం అనుమానం తీరిపోయింది. రెండోరోజు రాత్రి ఆయన ఆనందుడికి మంచి మెత్తని పరుపూ, దాని మీద మక్మల్ దుప్పటీ, కప్పుకునేటందుకు మెత్తని కాశ్మీరుశాలువా ఏర్పాటు చేయించి, అతను ఎలా నిద్రపోయేదీ గమనించమని మళ్ళీ నౌకరును పురమాయించాడు.

మూడోనాడు ఉదయం నౌకరు రాజుగారి దగ్గిరికి వచ్చి, "ఆ బాబు పక్క మీద

"సరే," అన్నాడు ఆనందుడు. అనక చేసేదీ లేదు.

అక్కడి నుంచి బయలుదేరి ఆనందుడు రాజభవనానికి చేరుకుని, రాజుగారిని పది, పన్నెండు ఓడలు అరువివ్వమని అడిగాడు.

"అబ్బో, వీడు చూడబోతే పెద్దవర్తకుడిలాగున్నాడు," అనుకుని, పైకి, "నువు మారువేషంలో ఉన్న కోటీశ్వరుడివైతే నా కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తాను, సమ్మతమేనా ?" అని రాజు అడిగాడు.

"ఆహా, సమ్మతమే. ఇవాళ నా దుస్తులు బాగాలేకపోతే రేపైనా బాగుండి తీరుతాయి," అన్నాడు ఆనందుడు.

పడుకుని తెల్లవార్లూ అటూ ఇటూ కదిలితే ఒట్టు! పుస్తకంలా పడుకుని నిద్ర పోయారు!" అన్నాడు.

రాజుగారి సందేహం తీరిపోయింది. ఆనందుడు సుఖాలకు అలవాటుపడిన కోటీశ్వరుడే నని నిశ్చయించుకుని, ఆ పూటే తన కుమార్తెను అతని కిచ్చి వైభవంగా పెళ్ళిచేసేశాడు.

అసలు జరిగినదేమంటే మొదటి రాత్రి ఆనందుడు తన బటానీగింజను చిరుగుల దుప్పటి కింద దాస్తే అది ఎటో దొర్లి పోయింది. దాని కోసం ఆనందుడు తెల్లవార్లూ పక్కంతా తడివి వెతుక్కున్నాడు. కాని అది కనిపించనే లేదు. ఆ రాత్రంతా నిద్ర లేని కారణంచేత మర్నాటి రాత్రి అతను పక్క మీద నడుము వాలుస్తూనే ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాడు.

నాలుగోరోజు తెల్లవారింది. ఆ రోజే రాక్షసుడు వచ్చి తనకు మూడు పొడుపుకథలు వేస్తాడు. తనకు ఒక్క పొడుపుకథా రాదు. అందుచేత ఆ పొడుపుకథలను తను విప్ప లేడు. రాక్షసుడు తనను తినేస్తాడు. ఈ ఆలోచన వచ్చి ఆనందుడు విచారంగా కూర్చున్నాడు.

అతని భార్య అయిన రాజకుమార్తె వచ్చి, "ఎందుకలా విచారంగా కూర్చు







న్నారు? మీకు వచ్చిన కష్ట మేమిటి?" అని అడిగింది.

"ఏమీ లేదు," అన్నాడు అనందుడు దిగులుగా.

అప్పుడు రాజకుమార్తెకు కూడా విచారం పట్టుకున్నది.

కొంచెంసేపయాక ఆమెను పెంచిన దాది వచ్చి, ఆమె దిగులుగా కూర్చుని వుండటం చూసి, "ఏం తల్లీ, ఎందుకంత విచారంగా ఉన్నావు?" అని అడిగింది.

"నా భర్త విచారంగా ఉన్నాడు. ఆయన విచారానికి కారణం తెలీక నాకు విచారంగా ఉన్నది," అన్నది రాజకుమార్తె.

దాది అనందుడి దగ్గిరికి వచ్చి, "నిన్న పెళ్ళయినవాడివి ఇలా విచారంగా ఉండ వచ్చా? తప్పు కాదూ? నిన్ను చూసి అమ్మాయి, చూడు, ఎంత విచారంగా ఉన్నదో? నీ దిగులుకు కారణం ఏమిటో నాకు చెప్పు. నేనంతా క్షణంలో సరి చేసి పారేస్తాను," అన్నది.

ముసలిదాని పోరు పడలేక అనందు డామెతో రాక్షసుడి విషయం చెప్పాడు. అది విని దాది, "ఇంతే గద! నాకు యాభైవేల పొడుపుకథలు తెలుసు, నేను కల్పించినవి ఇంకో యాభైవేలున్నాయి," అన్నది.

అనందుడికి ధైర్యం వచ్చింది. తరవాత జరగవలిసిన ఏర్పాటంతా ఆ ముసలిదే చేసింది. రాక్షసుడు వస్తే చీకటి కొట్టు దగ్గిరికి పంపమని ఆమె రాజభటులతో చెప్పి, అనందుణ్ణి వెంట పెట్టుకుని తాను చీకటి కొట్టులోకి వెళ్ళి తలుపు గడియ పెట్టేసింది.

మధ్యాన్నం వేళకు రాక్షసుడు, "అనందు డనేవాడు ఎక్కడ?" అంటూ రాజభవ నానికి వచ్చాడు. వాణ్ణి రాజభటులు చీకటి కొట్టు దగ్గిరికి తీసుకొచ్చారు.

"అనందూ, ఎక్కడున్నావు?" అని రాక్షసుడు అరిచాడు.



"ఈ కొట్టులో ఉన్నాను. నీ పొడుపు కథలు చెప్పు. వాటిని విప్పుతాను. విప్ప లేకపోతే తలుపు పగల గొట్టుకుని లోపలికి వచ్చి నన్ను తిను," అన్నాడు అనందుడు లోపలినుంచి.

"సరే, ఈ కథ విప్పు. మా అమ్మమ్మ నలభై కంబళ్ళు కప్పుకుంది. అదేమిటి?" అని రాక్షసుడు అడిగాడు.

దాది చెవిలో రహస్యంగా చెప్పిన మీదట అనందుడు, "మహా గొప్పగా అడిగావులే— అరటిపువ్వు!" అన్నాడు.

"అది సరిగానే చెప్పావు. ఇది చెప్ప లేవు చూసుకో. కొమ్ము లుండి ఎద్దు కాదు, అంబారీ ఉండి ఏనుగు కాదు, ఏమిటది?" అని రాక్షసుడు అడిగాడు.

మళ్ళీ దాది చెప్పిన మీదట, "నత్త," అని అనందుడు అరిచాడు.

రాక్షసుడికి ఆశాభంగమయింది. "అదీ చెప్పావే. ఈసారి చెప్పు చూస్తాం. నాకు నోరు లేదు గాని చక్కగా జవాబు లిస్తాను, నన్నెవరూ చూడలేరు కాని అందరూ విన గలరు. ఎవరు నేను?" అన్నాడు వాడు.

"ఓస్, ఇదేనా? నువు ప్రతిధ్వనివి!" అన్నాడు అనందుడు.

వెంటనే రాక్షసుడికి శాపవిమోచనమై, పొట్టపగిలి మరణించాడు.

అటుతరవాత రాక్షసుడి కోట అనందుడి దయింది. పదహారు రోజుల పండగ కాగానే అతను రాజుగారితో, "మామగారూ, ఇక నేనూ, నా భార్యా మా కోటకు వెళ్ళిపోతాం," అని చెప్పాడు.

తన అల్లుడికి ఒక కోట ఉన్నదని అప్పటి దాకా రాజుగారికి తెలియదు. ఆయన తన కూతురి వెంట అల్లుడి కోటకు వెళ్ళి, అక్కడ ఉన్న బంగారం రాసులూ, రత్న రాసులూ చూసి, "నేను ముందే అను కున్నాను. నా అల్లుడు కోటీశ్వరులకు కోటీశ్వరుడు!" అన్నాడు.





# భాగ్యశాలి

ఒక ఊళ్ళో శంభుదాసు అనే ధనికుడు ఉండేవాడు. అతనికి లేక లేక ఒక కుమారుడు కలిగాడు. ఆ కుమారుడికి శంభుదాసు, దేవదాసు అని తన తాతగారి పేరు పెట్టాడు.

ఒకసారి ఒక వృద్ధ యాత్రికుడు శంభుదాసింటికి వచ్చి, నుస్తీ చెయ్యటం వల్ల రెండు రోజులు శంభుదాసు చేత సపర్యలు చేయించుకుని వెళ్ళిపోతూ, దేవదాసును చూసి, "ఈ కొడుకు వల్ల మీ దౌర్భాగ్యం తొలగిపోతుంది, వీడు మంచి భాగ్యశాలి, దీర్ఘాయుష్మంతుడు," అని చెప్పాడు.

"నాకు దౌర్భాగ్యం ఏమీ లేదే? ఈయన ఇలా అన్నాడెందుకో?" అని శంభుదాసు ఆశ్చర్యపడ్డాడు.

కాని శంభుదాసుకు త్వరలోనే దౌర్భాగ్యం చుట్టుకున్నది. అతని ఇంటికి సాధారణంగా అతిథులు వచ్చిపోతూ ఉండేవారు. శత్రురాజ్యానికి చెందిన గూఢచారి మారువేషంలో వచ్చి శంభుదాసు ఇంట బస చేశాడనీ, ఇలాటి పని లోగడ కూడా ఒకటి రెండుసార్లు జరిగిందనీ రాజుగారు తన గూఢచారుల ద్వారా తెలుసుకున్నాడు. రాజుగారు శంభుదాసును రాజద్రోహిగా విచారణ చేసి, ఆయన ఇంటికి వచ్చిన శత్రుగూఢచారుల వివరాలు అడిగాడు. తన ఇంటికి అతిథులుగా వచ్చిపోయేవారి వివరాలు శంభుదాసు ఎరగడు. అందుచేత ఆయన ఏమీ చెప్పలేకపోయాడు. శంభుదాసు రాజద్రోహి అన్న అనుమానం దృఢపడి, రాజు ఆయన ఆస్తి అంతా స్వాధీన పరచుకుని, ఆయనకు నగర బహిష్కరణ శిక్ష విధించాడు.

శంభుదాసు భార్యా బిడ్డలతో, తనకు మిగిలిన పాత్రసామగ్రీ, బట్టలూ తీసుకుని, నగరం విడిచి దూరాన ఉన్న ఒక గ్రామానికి వెళ్ళి, అక్కడ ఉండే జమీందారు

పి. శ్రీనివాసాచారి

దగ్గర సేవకుడుగా ఉంటూ, తాను ఫలానా అని ఎవరికీ చెప్పక, ఒక కుటీరం నిర్మించుకుని, అందులో అజ్ఞాతవాసం చెయ్యసాగాడు. శంభుదాసు ఎప్పుడూ జమీందారు సేవలోనే ఉంటూ వారాని కొకసారి ఇంటికి వచ్చేవాడు. కుటీరంలో దేవదాసూ, అతని తల్లీ మాత్రమే ఉండేవాళ్లు.

దేవదాసు అయిదేళ్ళవాడై ఉండగా ఒక నాడు బొమ్మలు అమ్మేవాడొకడు రకరకాల బొమ్మలను తట్టలో పెట్టుకుని అమ్ముతూ వచ్చాడు. దేవదాసు ఆ మనిషిని పిలిచి, తట్ట దింపించి, అందులో ఉన్న గుర్రం బొమ్మ కావాలన్నాడు. దాని ఖరీదు ఒక వరహా అన్నాడు బొమ్మల వాడు. దేవదాసు తనవద్ద డబ్బు లేదన్నాడు. డబ్బు లేకపోతే అంత ఖరీదు చేసే వస్తువేదన్నా ఇస్తే గుర్రం బొమ్మ ఇస్తానన్నాడు బొమ్మల వాడు. దేవదాసు ఇంట్లోకి పరిగెత్తుకుపోయి, బియ్యం కుండ మీద మూతపెట్టి ఉన్న పళ్ళెం తెస్తూ, గడప తగిలి పడ్డాడు. పళ్ళెం రాతిబండ మీద పడింది.

దేవదాసు వెంటనే లేచి పళ్ళెం తీసుకుని, దాన్ని బొమ్మల వాడికిచ్చి, "ఇది తీసుకుని గుర్రం బొమ్మ ఇస్తావా?" అని అడిగాడు.



ఆ పళ్ళెం కిలంపట్టి నల్లగా ఉన్నది. అది రాతి మీద పడ్డచోట పచ్చగా కనబడింది. కాని అది ఇత్తడి పళ్ళెం కాదు. ఇత్తడి కన్న బరువున్నది. రాతి మీద పడ్డప్పుడు ఇత్తడిలాగా మోగను కూడా లేదు. ఇదంతా గమనించిన బొమ్మల వాడు, "సరే, తే!" అని ఆ పళ్ళెం తీసుకుని తట్ట అడుగున దాచి, గుర్రం బొమ్మను దేవదాసు కిచ్చి వెళ్ళిపోయాడు.

ఇది జరిగినప్పుడు దేవదాసు తల్లి ఇంట్లో లేదు. ఆమె తిరిగి వచ్చాక దేవదాసు తన కొయ్యగుర్రం బొమ్మ చూపించి, బియ్యం కుండ మీది మూతతో దాన్ని కొన్నానని





దొర్లింది. దాని మూత తీసి చూస్తే అందులో ఎనిమిది వజ్రాలున్నాయి.

వాటిని చూసి దేవదాసు తల్లి, "నీకీ బొమ్మ ఇచ్చినవాడు ఎంత మోసపోయాడో చూశావు రా? ఈ గుర్రంలో ఈ బరిణా, వజ్రాలూ ఉన్న సంగతి వాడికి తెలీదో, ఏమో! ఈ సారి వాడు కనిపిస్తే పిలిచి, ఈ బరిణ వాడికి ఇచ్చెయ్యి," అన్నది.

మర్నాడు బొమ్మల వాడు దేవదాసుకు దూరాన కనిపించాడు. కాని వాడు దేవదాసు ఉండే వైపుగా రాక మరొకవైపు తిరిగాడు. దేవదాసు బరిణ తీసుకుని పరిగెత్తుకుంటూ వెళ్ళి బొమ్మలవాణ్ణి కలుసుకుని, "నువు నాకు గుర్రం బొమ్మ ఇచ్చావే, దాని పొట్టలో ఈ బరిణ దొరికింది. ఇందులో ఏమున్నాయో చూశావా?" అంటూ బరిణ తీసి వజ్రాలను చూపించాడు.

బొమ్మలవాడు దేవదాసు చేతి నుంచి బరిణను చప్పున లాగేసి తన జేబులో దాచుకుని, "నువు చాలా మంచివాడివి!" అని గబగబా వెళ్ళిపోయాడు.

ఆ బరిణ బొమ్మల వాడికి చేరినందుకు దేవదాసు తల్లి కూడా చాలా సంతోషించింది.

ఇంతకూ ఆ బొమ్మల వాడొక దొంగ వ్యాపారి. వాడు చాలా ఊళ్ళు తిరుగుతాడు.

చెప్పాడు. తన కొడుకును చూసి ముచ్చటపడి బొమ్మల వాడు అంత చవుకగా ఆ గుర్రాన్ని ఇచ్చి ఉంటాడని ఆమె అనుకున్నది. బియ్యం కుండమీది మూత బంగారమని ఆమెకు తెలీదు.

దేవదాసు కొన్న గుర్రానికి చక్రాలున్నాయి. తోస్తే అది చక్రాలమీద పరిగెడుతుంది. దాన్ని చాలా దూరం పరిగెత్తించాలని దేవదాసు కాలితో గట్టిగా తన్నాడు. తన్నుకు ఆ గుర్రం నేలమీది నుంచి మొత్తంగా లేచి వెళ్ళి గోడకు కొట్టుకున్నది. అలా కొట్టుకోవటంలో దాని డొక్క భాగం విరిగి, ఒక బంగారు బరిణ బయటికి





ఎక్కడ ఏది అందితే దాన్ని చేతివాటు వేసి, తీసుకుపోయి మరొక ఊళ్ళో అమ్ముతాడు. వాడు దేవదాసుకు అమ్మిన గుర్రం బొమ్మ కూడా ఒక వడ్రంగి ఇంటినుంచి కాజేసినదే. ఎంత దొంగ వ్యాపారం చేసినా ఇంతగా వాడి కెన్నడూ కలిసిరాలేదు. ఆ కొయ్యి గుర్రం కొన్న అబ్బాయి చేతిమీదుగా తనకు బంగారు పళ్ళెమూ, ఒక బంగారు భరిణా, ఎనిమిది వజ్రాలూ దొరికాయి. వాడు తన వద్ద మిగిలిన బొమ్మలను పిల్లలకు ఊరికే ఇచ్చేసి, నగరానికి వెళ్ళాడు. అక్కడ వాడు బంగారు పళ్ళాన్ని ద్రావకంతో కడిగి, కిలమంతా పోగొట్టి, ధగధగా మెరిసేటట్టు చేశాడు. దాని అడుగున సంస్కృతం అక్షరాలు కూడా ఉన్నాయి. కాని అవి వాడికి అర్థం కాలేదు; ఏదో స్తోత్రం అయి ఉంటుందనుకున్నాడు.

తరవాత బొమ్మలవాడు వ్యాపారిలాగా కనబడటానికి కాస్త మంచి బట్టలు వేసుకుని, బంగారు పళ్ళాన్ని ఒక వర్తకుడి దగ్గిరికి తీసుకుపోయి, అమ్మకానికి తెచ్చానని చెప్పాడు.

వర్తకుడు దాన్ని శ్రద్ధగా పరిశీలించి, "ఇది చాలా విలవైనదే, దీన్ని ఎందుకు అమ్ముతున్నావు?" అని అడిగాడు.



"విలవైనది కనకనే అమ్ముతున్నాను. కావలిస్తే డబ్బిచ్చి తీసుకోండి. నాకు అవతల బోలెడన్ని పనులున్నై," అన్నాడు బొమ్మలవాడు.

వాడి మాట తీరుచూసి వర్తకుడు, ఆ పళ్ళెం వాడి సొత్తు కాదని తెలుసుకుని, "ఇది నీకు ఎలా వచ్చింది? నిజం చెప్పు," అని ప్రశ్నించాడు.

ఈ మాట వింటూనే బొమ్మలవాడు పారిపోవటానికి యత్నించాడు. నలుగురూ చేరి పట్టుకున్నారు. వాణ్ణి సోదా చేస్తే, వాడి జేబులో బంగారు బరిణా, అందులో ఎనిమిది వజ్రాలూ ఉన్నాయి. వర్తకుడు

వాణ్ణి రాజభటులకు అప్పగించి, దివా ణానికి పంపాడు.

అబద్ధాలు తనను కాపాడలేవని తెలిసి బొమ్మలవాడు న్యాయాధికారితో, తాను గుర్రం బొమ్మను ఏ గ్రామంలో, ఏ వడ్రంగి ఇంటి నుంచి దొంగిలించినదీ, ఏ ఇంటి కుర్రాడికి తాను దాన్ని ఎలా అమ్మినదీ, ఆ కుర్రాడికి ఆ గుర్రం బొమ్మలో బరిణ దొరికేసరికి వాడు మర్నాడు దాన్ని తనకు ఎలా ఇచ్చినదీ వివరంగా చెప్పేశాడు.

బంగారు బరిణా, అందులోని వజ్రాలూ ఫలానా జమీందారువని రూఢి అయింది. ఆ బరిణను కొయ్య గుర్రంలో దాచిన వడ్రంగి రెండు నెలల క్రితం జమీందారు గారింట ఏదో వడ్రంగం పనిచేసి, వెళ్లిపోతూ ఆ బరిణను కాజేశాడు. ఒకరికి ఇద్దరు దొంగలూ దొరికిపోయారు.

దీనితో బాటు ఇంకొక సంగతి బయట పడింది. బంగారు పళ్ళెం అడుగున రాజు గారి తండ్రి పేరూ, శంభుదాసు తాతగారైన దేవదాసుగారి పేరూ ఉన్నాయి. ఆ నాడు దేవదాసుగారి రాజభక్తికి మెచ్చి, రాజుగారు ఆ బంగారు పళ్ళెం నిండా బంగారు మొహర్లు పోసి కానుకగా ఇచ్చారట. అటువంటి దేవదాసు మనమడు, శంభుదాసు, తన ఇంట సేవకుడుగా పనిచేస్తున్నాడని విని జమీందారు నొచ్చుకుని, అతనికి ఈ దుర్గతి ఎలా కలిగిందో తెలుసుకున్నాడు.

తనపై రాజద్రోహ నేరం ఎలా వచ్చి నదీ తనకే తెలియదని శంభుదాసు జమీం దారుతో అన్నాడు. జమీందారు ఆ మాట నమ్మి, అయనపై శిక్షను రద్దు చేయవల సిందని రాజుగారికి సలహా ఇచ్చాడు.

రాజుగారు శంభుదాసు పైన మోపిన ఆరోపణను ఉపసంహరించుకుని, అతని ఆస్తి తిరిగి అతని పరం చేశాడు. ఈ విధంగా దేవదాసు తన తండ్రి దౌర్భాగ్యం తొలగిపోవటానికి తానే కారకుడయాడు.





# పారని యుక్తి

పిల్లలకు పెద్ద సందేహం వచ్చింది: సింహాలకూ, పులులకూ మనం తినే లడ్డూలూ, గారెలూ, పాయసమూ పెడితే తింటాయా, తినవా? ఒకవేళ తింటే మన మాట వింటాయా, వినవా?

ఆ రోజు దీపావళి. బామ్మ చాలా రకాల పిండి వంటలు చేసింది. బొబ్బట్లూ, గారెలూ భలే బాగున్నాయి. సింహాలు వాటిని తినవనీ, వాటికి ఇవి సయించవనీ పెద్దవాడు అన్నాడు. మిగతావాళ్ళు ఆ మాట నమ్మలేక ఏకంగా తాతయ్యను అడిగారు.

"దానికో కథ ఉందర్రా," అన్నాడు తాతయ్య పొడుం పీలుస్తూ.

"కథ! కథ!" అంటూ అందరూ తాతయ్య చుట్టూ మూగారు.

"కథలో సింహం బొబ్బట్లూ, లడ్డూలూ, గారెలూ తింటుందా, తాతయ్యా?" అని బుల్లివాడు అడిగాడు.

"కాస్త ఓపిక పట్టండిరా!" అంటూ తాతయ్య కథ ప్రారంభించాడు.

ఒక ఊళ్ళో ఒక వంట బ్రాహ్మడుండేవాడు. పెళ్ళిళ్ళకూ, తద్దినాలకూ, సంతర్పణలకూ పెద్ద వంట చెయ్యాలిసొస్తే చుట్టు పక్కల అనేక ఊళ్ళవాళ్ళు ఆ బ్రాహ్మణ్ణి పిలిచేవాళ్ళు. ఏది చేసినా ఆ బ్రాహ్మడు దివ్యంగా చేసేవాడు, నలభీమపాకమే.

ఒకసారి ఏమయిందంటే, అడివి అవతల ఒక జమీందారుగారింట పెద్ద సంతర్పణ జరిగింది. వంటకు మన బ్రాహ్మణ్ణి పిలిచారు. సంతర్పణ అయిపోయాక, మిగిలిపోయిన పిండివంటలు ఇన్ని మూటగట్టుకుని, అరణ్యం మధ్యగా అడ్డ దారిన అతను ఇంటికి బయలుదేరాడు. అది పెద్ద పొరపాటు పని. ఎంచేతంటే ఆ అరణ్యంలో ఒక గుహ ఉన్నది. అందులో ఒక భయంకరమైన సింహం ఉన్నది.

నర్సేపల్లి సుబ్బారావు




ఆ సింహం బ్రాహ్మణ్ణి చూడగానే, "ఏయ్, నిలు! నాకు చెడ్డ ఆకలిగా ఉంది. నిన్ను తినేస్తాను," అన్నది.

"నన్నెందుకు తింటావు, మృగరాజా? నా కన్న చాలా రుచి అయిన తిను బండారాలు ఈ మూటలో ఉన్నాయి. కావలిస్తే హాయిగా వాటిని తిను," అని బ్రాహ్మడు తన మూట విప్పాడు.

మూట విప్పుతుంటేనే సింహానికి కమ్మని వాసన కొట్టింది. అది మూటలో ఉన్న మూడు వీశెల భక్ష్యాలూ అవురావురున తిని, "అబ్బ, ఈ తిండి ఎంత బాగుంది! ఎన్నడూ తినక పోతినే! ఇంత మంచి భోజనం పెట్టి నందుకు నా గుహలో ఉన్న బంగారం కొంచెం పట్టుకెళ్ళు!" అన్నది.

సింహం మనుషులను చంపి తిన్నప్పుడల్లా వాళ్ళ డబ్బూ, నగలూ తన గుహలో ఒక మూల పోగేసి ఉంచుతుంది.

సింహం గుహలో ఉన్న ధనం చూసి వంట బ్రాహ్మడికి కళ్ళు కుట్టాయి.

"మృగరాజా, నీకు ఇలాటి భోజనం రోజూ తెచ్చి పెట్టగలను!" అన్నాడు అతను.

"తప్పక తీసుకురా!" అన్నది సింహం.

అది మొదలు బ్రాహ్మడు రోజూ షడ్రసోపేతమైన భోజనం తయారు చేసి తెచ్చి, సింహానికి పెట్టి, సింహం గుహలో ఉన్న ధనం కొంత తీసుకుపోయేవాడు. సింహం మనిషి భోజనం మరిగింది. సింహం డబ్బుతో బ్రాహ్మడి దరిద్రం తీరిపోయింది.

కాని మధ్యలో నక్కకే చెడ్డ రోజులు వచ్చాయి. సింహం వెంట నక్క ఉంటుందని మీకు తెలుసుగా? సింహం ఏ జంతువునన్నా వేటాడి, తన కడుపు పట్టినంత తిని, మిగిలినది వదిలేస్తే నక్క దానితో తన పొట్ట నింపుకుంటూ ఉండేది.

కాని సింహం మనిషి భోజనం మరిగాక వేట మానేసింది. అందుచేత నక్క డొక్క మాడ నారంభించింది.

"ఈ దిక్కుమాలిన బ్రాహ్మడి పీడ వది లించుకోకపోతే నేను ఆకలికి మాడి చావక తప్పదు," అనుకుని నక్క బ్రాహ్మడి సమస్య తేల్చటానికి ఒక ఉపాయం ఆలోచించింది.

ఒక రోజు ఉదయం అది సింహం దగ్గిరికి వచ్చి, "మహారాజా, ప్రమాదం! ప్రమాదం!" అని ఆదుర్దాగా కూసింది.

"ఎందు కంత కంగారు? ఏమిటా ప్రమాదం? ఎవరికా ప్రమాదం?" అని సింహం నక్క మీద కసురుకున్నది.

"నిన్న రాత్రి నేను మన బ్రాహ్మడి పంచలో పొంచి, లోపల బ్రాహ్మడూ, పెళ్ళామూ మాట్లాడుకునే మాటలు విన్నాను. మీ రిచ్చిన డబ్బుతో బ్రాహ్మడు చాలా భాగ్యవంతుడయాట్ట. మిమ్మల్ని కడ తేర్చటానికి ఇవాళ తెచ్చే భోజనంలో విషం పెడతానని తన పెళ్ళాంతో అన్నాడు. నా చెవులారా విన్నాను," అన్నది నక్క.

ఈ మాట విని సింహం కోపంతో పళ్ళు కొరికి, కళ్ళెర్ర చేసి, "అలాగా? రానీ, వాడి అంతు తేలుస్తాను," అన్నది. తన ఎత్తు పారుతున్నందుకు నక్క చాలా సంతోషించింది.

కాస్సేపటికి తినుబండారాలతో బ్రాహ్మడు రానే వచ్చాడు.



అతన్ని చూస్తూనే సింహం, "నరాధమా! కృతఘ్నుడా! దగుల్బాజీ! నా ప్రాణానికే ఎసరు పెడతావురా?" అన్నది.

బ్రాహ్మడు తెల్లబోయి, "అదేమిటి? నేనేం చేశాను?" అని అడిగాడు.

"ఈ తిండిలో విషం పెట్టావా, లేదా? నిజం చెప్పు," అన్నది సింహం.

"ఛీ! ఛీ! అలాటి పని ఎందుకు చేస్తాను? నీకు అనుమానంగా ఉంటే నేను తిని చూపిస్తాను," అన్నాడు బ్రాహ్మడు.

"చావు తప్పదని తెలిసి, ఈ దొంగవాడు తేలికగా చద్దామని చూస్తున్నాడు, మహారాజా! వీణ్ణి సులువుగా చావనివ్వకండి. ఈ వంట నేను తిని చూస్తాను. అందులో నిజంగా విషం ఉంటే వీణ్ణి తమరు చిత్రవధ చేసి మరీ చంపండి," అన్నది నక్క.

నక్క ఒకే ఒక భక్ష్యాన్ని తిని, చచ్చినట్టు పడిపోయింది. సింహానికి వున్న కాస్త అనుమానం కూడా తీరిపోయింది.

"నక్క నీ విషపు తిండి తిని చచ్చిపోయింది. నిన్ను తగిన విధంగా శిక్షిస్తాను," అన్నది సింహం బ్రాహ్మడితో.

"మృగరాజా, నా వల్ల నిజంగా తప్పుంటే శిక్షించటం భావ్యమే. కాని ఒక్క మనవి. నే నెలాగూ చచ్చిపోతాను గనక నాకు ఉత్తమ లోకాలు కలిగేటట్టు అనుగ్రహించండి. నా జంఝానికి నక్క చర్మం కట్టుకుంటే నేను తిన్నగా స్వర్గానికి పోతాను. అరిచేతి ప్రమాణాన నక్క చర్మం దయచేయించండి. ఈ చిన్న కోరికను మన్నించండి," అన్నాడు బ్రాహ్మడు.

"దానికేం భాగ్యం? నక్క ఎలాగూ చచ్చింది గద!" అంటూ సింహం తన పంజా విప్పి, గోళ్ళు పదును పెట్టుకుని, చచ్చినట్టు పడి ఉన్న నక్కను సమీపించింది. వెంటనే నక్క లేచి, ప్రాణభయంతో, కాలి సత్తువ కొద్దీ పారిపోయింది. పాపం, దాని ఎత్తు పారనేలేదు.






# "ఏమీలేదు"

ఒక గ్రామంలో రాజయ్యా అనే నిరుపేద వాడుండేవాడు. అతను రోజూ అడవికి పోయి కట్టెలూ, పనికివచ్చే ఇతర వస్తువులూ తెచ్చుకుని, వాటితో జీవయాత్ర గడుపుతూ ఉండేవాడు.

ఒకనాడు రాజయ్యా అదృష్టం బాగుండి అడవిలో బోలెడన్ని వస్తువులు దొరికాయి. ఆ రోజు మోపు కాస్త పెద్దదయింది. దాన్ని నెత్తి కెత్తుకోవాలంటే ఎవరి సహాయమైనా కావాలి. ఎవరైనా కనిపిస్తారేమో నని రాజయ్యా అటూ ఇటూ చూస్తూంటే సంగర జిత్తు అనేవాడు అటుగా వచ్చాడు.

ఈ సంగరజిత్తు పెద్ద పేచీకోరు. అవకాశం దొరికితే చాలు, వాడు ప్రతివాళ్ళ దగ్గరా డబ్బు గుంజేవాడు.

సంగరజిత్తును చూడగానే రాజయ్యా, "సమయానికి వచ్చావు, ఈ మోపు కాస్త నా నెత్తికి ఎత్తిపెట్టు," అన్నాడు.

"అలాగే ఎత్తుతాను గాని, నేను సహాయం చేసినందుకు నా కివ్వటానికి నీ దగ్గిర ఏమున్నది?" అని సంగరజిత్తు రాజయ్యాను అడిగాడు.

"ఏమీ లేదు, సంగరజిత్తూ!" అన్నాడు రాజయ్యా.

"సరే అయితే," అని సంగరజిత్తు రాజయ్యాకు మోపు ఎత్తిపెట్టి, "నీ దగ్గిర ఉన్నదేదో ఇట్లా పారెయ్యి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

"ఏమీ లేదు; అని ముందే చెబితిని గదా, సంగరజిత్తూ?" అన్నాడు రాజయ్యా,

"నేను కాదన్నానా? ఆ ఏమీలేదు అనేదే పడెయ్యి," అన్నాడు సంగరజిత్తు.

"నా దగ్గిర ఏమీ లేదన్నానుగాని, ఏమీ లేదు అనే వస్తువు ఉన్నదనలేదు," అన్నాడు రాజయ్యా, సంగరజిత్తు దుర్బుద్ధికి లోపల వ్యథపడుతూ.

కాపుగంటి లక్ష్మపర్వతవర్ధని

"అదంతా నాకు తెలీదు. నీ దగ్గిర ఏమున్నదంటే, ఏమీలేదు ఉన్నదన్నావు. అదన్నా పడెయ్యి, లేదా నీ కట్టెలమోపన్నా నా పరం చేసెయ్యి. తెలిసిందా?" అన్నాడు సంగరజిత్తు, మొండిగా.

సంగరజిత్తు వైఖరి చూసి సాత్వికుడైన రాజయ్యకే మంట పుట్టుకొచ్చింది. "నీ వేషాలు కట్టిపెట్టి గ్రామాధికారి దగ్గిరికి పద. అయనే న్యాయం చెబుతాడు," అని రాజయ్య సంగరజిత్తుతో సహా గ్రామాధికారి వద్దకు వచ్చాడు.

గ్రామాధికారి ఇద్దరి మాటలూ విని సంగరజిత్తును, "నువు ఈ రాజయ్యకు సహాయం చేసినప్పుడు ఏమడిగావు?" అని అడిగాడు.

"అతడి నెత్తికి కట్టెలమోపు ఎత్తే ముందు, నీ దగ్గిర ఇవ్వటానికి ఏమున్నదని అడిగాను. అంటే ఏమీలేదు అన్నాడు," అన్నాడు సంగరజిత్తు.

"తరవాత నువు సహాయం చేశావు. ఏమిస్తాడని సహాయం చేశావు?" అని గ్రామాధికారి అడిగాడు.

"తన దగ్గిర ఏమీలేదు ఉన్నదన్నాడు కదండీ? అదే ఇస్తాడనుకుని సహాయం చేశాను," అన్నాడు సంగరజిత్తు.

"ఇంతకూ అతను నీ కిచ్చిందేమిటి?" అని గ్రామాధికారి అడిగాడు.

"ఏమీలేదు," అన్నాడు సంగరజిత్తు.

"అంటే నువ్వడిగినదే అతనిచ్చాడన్న మాట! అతని దగ్గిర ఉన్నదీ ఏమీలేదు. అతను నీ కిచ్చినదీ ఏమీలేదు. ఇంకెందుకు తగాదా పెట్టి మోపు ఇచ్చెయ్యమంటున్నావు? ఈసారి ఇటువంటి అక్రమాలు చేశావంటే నిన్ను తీవ్రంగా శిక్షిస్తాను," అని బెదిరించి, గ్రామాధికారి సంగరజిత్తును పంపేశాడు.

పెద్ద బెడద వదిలినందుకు సంతోషించి రాజయ్య కూడా ఇంటికి వెళ్ళిపోయాడు.





# కృష్ణావతారం

బాణుడి రథం వెయ్యి మూరల నిడివిగలది. దానికి వెయ్యి గుర్రాలు పూన్చివున్నాయి. రథం ఎలుగుబంటి తోలు కప్పి ఉన్నది. దానికి ఒక ఎర్రజెండా, నెమలి పతాకా ఉన్నాయి. ఆ రథం నిండా గదలూ, విల్లులూ, ఖడ్గాలూ, శక్తులూ పెట్టుకుని కుంభాండుణ్ణి సారథిగా చేసుకుని, బాణుడు అనిరుద్ధుడి పై యుద్ధానికి బయలుదేరాడు. అది చూసి అతని సేనాపతు లందరూ ఉత్సాహం తెచ్చుకుని, తమ సేనలను బాణుడి రథానికి ముందూ, పక్కలా నడిపించుకుంటూ వచ్చారు.

అనిరుద్ధుడు తన పైకి వచ్చే బాణుణ్ణీ, అతని ఆయుధాలనూ, అతని చుట్టూ గల బలాలనూ చూసి ఏమాత్రం లక్ష్యపెట్టక, సూటిగా బాణుడి రథం కేసి ఎదురు రానారంభించాడు.

ఒక సామాన్య మానవుడు, అందులోనూ ఆయుధాలు విశేషంగా లేనివాడు, తన పైకి ధైర్యంగా వస్తూ ఉంటే బాణుడికి ఆశ్చర్యం కలిగింది. అతను తన రాక్షస సైనికులతో, "చూస్తారేం? వాణ్ణి పట్టుకోండి! చంపి పారెయ్యండి!" అంటూ అనిరుద్ధుడి పై బాణవర్షం కురిపించాడు.

చేత ఒక్క కత్తి మాత్రమే గల అనిరుద్ధుడు ఆ బాణాలను లక్ష్యపెట్టక, తనకు అడ్డంగా వచ్చే రాక్షసులను తోసుకుంటూ బాణుడు ఎక్కివున్న రథాన్ని చేరుకున్నాడు. అది చూసి బాణుడి పరివారం నిర్ఘాంతపోయింది.

26. బాణానిరుద్ధుల యుద్ధం



రథాన్ని సమీపిస్తూనే అనిరుద్ధుడు రథపు గుర్రాలను చంపసాగాడు. రక్తం ఏరులై పారింది. ఈ లోపల బాణుడు అనిరుద్ధుడి పై అనేక ఆయుధాలు విసిరాడు. అనిరుద్ధుడు చచ్చాడనుకుని రాక్షసులు పెడబొబ్బ పెట్టారు. అయితే అనిరుద్ధుడు ముందుకు రాలేకపోవటం మాత్రమే జరిగింది.

ఇంతలో బాణుడు అనిరుద్ధుడి పైకి మహాశక్తిని విసిరాడు. అనిరుద్ధుడు దాన్ని చేత్తో పట్టుకుని, బలంకొద్దీ బాణుడి పైకే విసిరేసరికి, అది బాణుడి గుండెలను చీల్చుకుని, వీపులోనుంచి బయటికి వచ్చి,



భూమిలో దిగబడి పోయింది. బాణుడు ధ్వజస్తంభాన్ని పట్టుకుని కూలిపోయాడు.

కుంభాండుడు బాణుడికి స్పృహ వచ్చేటట్టు చేసి, "శత్రువు అసామాన్య ప్రతిభావంతుడు. ప్రపంచ మంతా ఎత్తి వచ్చినా లక్ష్య పెట్టేటట్టు కనపడడు. అతడి సాహసమూ, ధైర్యమూ చూశావా? అతన్ని గెలవటం తేలిక కాదు. ముందు నీ ప్రాణాలూ, నా ప్రాణాలూ దక్కే ఉపాయం చూడకపోతే అతను రాక్షసకులానికే ఎసరు పెట్టేటట్టున్నాడు," అన్నాడు.

బాణుడు తన మంత్రితో, "గరుత్మంతుడు పామును పట్టినట్టుగా ఈ క్షణంలోనే ఈ మూఢుణ్ణి పట్టేస్తాను చూడు," అంటూ అదృశ్యుడై పోయి, తన కోసం దిక్కులు చూస్తున్న అనిరుద్ధుడి పైన కృష్ణసర్ప ముఖాలు గల బాణాలు వేసి, అతని అవయవాలన్నీ బంధించి, కదలకుండా చేశాడు. తరవాత అతను కుంభాండుడితో, "యౌవన గర్వితుడైన ఈ దుర్మార్గుడు ఇప్పుడు మనకు చిక్కాడు. వీణ్ణి వెంటనే కత్తికి బలి చేద్దాం. లేకపోతే వీడు తెచ్చిపెట్టిన కళంకం మాయదు," అన్నాడు.

ఆ మాటకు కుంభాండుడు, "అదినిజమే గాని, ఒక్క విషయం గమనించాలి.





ఇతను మన ఉషకు గాంధర్వ వివాహం ద్వారా ఇదివరకే భర్త అయి ఉన్నాడు. ఇతనికి ఏదన్నా జరిగితే అమ్మాయికి తీరని దుఃఖం కలిగి తీరుతుంది. అసలు ఇతను ఎక్కడి నుంచి వచ్చాడో, ఎవడో తెలుసు కోవలసిన అవసరం ఉన్నది. ఇతను మామూలు మనిషి మటుకు కాడు. ఇతని అందమూ, పరాక్రమమూ చూస్తే దేవత లను మించి ఉన్నాడు. ఇతను తప్పక చాలా గొప్పవాడే అయి ఉంటాడు. నీ వంటి మహా వీరుడితో ఎలా యుద్ధం చేస్తానా అన్న జంకు అతనిలో ఏ మాత్రమైనా కన బడిందా? అసహాయుడైపోయి కూడా అతని ముఖాన క్రోధం ఎట్లా తాండవిస్తు న్నదో చూడు! నీ కింతకన్న మంచి అల్లుడూ, అమ్మాయికి ఇంతకన్న మంచి భర్తా, నీ కింతకన్న మంచి ప్రత్యర్థీ దొరుకు తాడా? కాస్త ఆలోచించు," అన్నాడు.

కుంభాడుడి మాటలలో నిజం ఉన్నట్టే బాణుడికీ తోచింది. బాణుడు, "అదీ నిజమే," నన్నట్టు తల ఆడించి, అనిరుద్ధు డికి భటులను కావలి ఉంచి, తన ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.

అప్పుడు నారదుడు అనిరుద్ధుణ్ణి సమీ పించి, ఊరడించి, "నేను వెళ్ళి కృష్ణుణ్ణి



తీసుకు వస్తాను. అతని రాకతో నీ కష్టా లన్నీ విచ్చిపోతాయి. అంతదాకా ఈ వచ్చిన కష్టాన్ని ధైర్యంగా ఓర్చుకో," అని చెప్పి, వెళ్ళిపోయాడు.

అనిరుద్ధుడు తల ఎత్తి చూసే సరికి, కన్నీరు కార్చుతూ ఉష కిటికీ వద్ద కని పించింది. అతను ఆమెతో, "నీ తండ్రి నాతో ముఖాముఖి యుద్ధం చెయ్యలేక, మాయోపాయంతో నన్ను బంధించాడు. అయినా విచారంలేదు. నా కష్టం తొలగించ కలవాడు కృష్ణు డున్నాడు. తన సుదర్శన చక్రంతో ఎందరో రాక్షసులను నిర్మూ లించినవాడు నాకు జరిగిన ఈ పరాభవాన్ని



సహిస్తాడా? ఎందుకు దిగులు పడతావు? నీ తండ్రికి మంచిరోజులు చెల్లిపోయాయి," అని చెప్పాడు.

తరవాత అతను దుర్గను స్తోత్రం చేసి ధ్యానించసాగాడు. కొంతసేపటికి లోకేశ్వరి అయిన దుర్గ అతని ఎదట ప్రత్యక్షమై, అతన్ని బంధించిన బాణాల పంజరాన్ని చేత్తో తాకి భగ్నం చేసి, అతన్ని బంధ విముక్తుణ్ణి చేసి, "త్వరలోనే కృష్ణుడు వచ్చి, బాణుడితో యుద్ధం చేసి ఓడించి, నిన్ను తీసుకు పోతాడు. నీకు శుభం చేకూరుతుంది," అని చెప్పి అంతర్ధానమయిపోయింది.



ఈ లోపల ద్వారకలో చాలా గందరగోళం జరిగింది.

చిత్రరేఖ అనిరుద్ధుణ్ణి తీసుకు పోయాక అనిరుద్ధుడి భార్యలు స్పృహ తెలిసి, తమ భర్త జాడ తెలియక, పెద్ద పెట్టున శోకాలు పెట్టసాగారు.

అనిరుద్ధుడి మందిరం నుంచి స్త్రీల ఆర్తనాదాలు వెలువడటం విని నగరంలోని యాదవ ప్రముఖులు తమ తమ ఇళ్ళలో నుంచి బయటికి వచ్చేసరిక, సభాభవనంలో భేరీ మోగింది. త్వరలోనే కృష్ణ బలరాములు మొదలుగా అందరూ సభలో చేరారు. అనిరుద్ధుడు కనిపించటం లేదని తెలిసి అందరూ విచారగ్రస్తులయారు. కృష్ణుడు సైతం కంట తడిపెట్టాడు.

అది చూసి వికద్రుడు కృష్ణుడితో, "నీ చాటున యాదపవంశం క్షేమంగా ఉన్నది. దేవేంద్రుడే తన క్షేమానికి నీ మీద ఆధారపడి ఉన్నాడు. అలాటప్పుడు నువు కంట తడిపెడితే, అనిరుద్ధుడు కనపడక పోవటం కంటె కూడా ఇది పెద్ద విచారం అవుతుంది. అందుచేత నువు అందరికీ ఏదన్నా ధైర్యం చెప్పు," అన్నాడు.

దానికి కృష్ణుడు, "నా విచారం అనిరుద్ధుడి జాడ తెలుసుకోలేకపోతే జనం





నన్ను ఏమంటారో ననే. చంటి పిల్లవాడుగా ఉండగానే ప్రద్యుమ్నుణ్ణి ఒక రాక్షసుడు ఎత్తుకు పోయాడు. ఆ రాక్షసుణ్ణి ప్రద్యుమ్నుడే చంపి తిరిగి రావటంతో నా పరువు కొంతవరకు దక్కింది. ఈ సారి కూడా అలాగే అయినట్టు కనబడుతుంది. నా శత్రువు లెవరో నా మీది కసితో ఈ పని చేశారు. ఇది సాధారణ ఘటన మాత్రం కాదు. ఏదైనా మార్గం ఉంటే చెప్పండి. దాన్ని అనుసరించి నా శక్తి కొద్దీ చెయ్యవలసినది చేస్తాను," అన్నాడు.

అప్పుడు సాత్యకి, వివిధ ప్రాంతాలకు మనుషులను పంపమని సూచించాడు.



ఉగ్రసేనుడు ఆ సూచనను బలపరిచి, రథాలమీదా, గుర్రాలమీదా, కాలినడకనా, అనేక మందిని అనేక ప్రాంతాలకు పోయి, అనిరుద్ధుణ్ణి వెతకమని ఉత్తరు విచ్చాడు.

అనాదృష్టి అనే సేనాపతి కృష్ణుడితో జంకుతూ జంకుతూ, "అయ్యా, నా కొక అనుమానం ఉన్నది. దేవతలు చాలా సార్లు నీ వల్ల ఉపకారం పొందివున్న మాట నిజమే గాని, పారిజాతం తెచ్చినప్పుడు ఇంద్రుడు నీతో యుద్ధంచేసి ఓడిపోయాడు. ఆ అవమానం లోపల బాధిస్తూ ఉండ వచ్చు. ఇంద్రుడే అనిరుద్ధుణ్ణి మాయం చేశాడా అని నా అనుమానం," అన్నాడు.

కృష్ణుడు ఈ మాటకు నవ్వి, "దేవతలు ఇలాంటి పని ఒక్కనాటికీ చెయ్యరు. ఇది రాక్షసులు చేసే పని. నావల్ల తమకు ఉపకారం ఉన్నదని తెలిసిన దేవతలు ఇలాటి పని చెయ్యరు," అన్నాడు.

అక్రూరుడు కూడా కృష్ణుడి మాటను బలపరిచాడు.

"అనిరుద్ధుణ్ణి ఇలా దొంగిలించుకు పోవలసిన పని పురుషుల కుండదు. ఎవతో పాపాత్మురాలైన స్త్రీయే ఈ పని చేసి ఉండాలి. దైత్య, దానవ, దేవతా స్త్రీలకు ఎన్నో మాయలు తెలుసు. వాళ్లు ఎక్కడి





కైనా పోగలరు, ఎవరినైనా భ్రమ పెట్ట గలరు. కనక మనం ఆ జాడలను బట్టి వెతకాలి," అన్నాడు కృష్ణుడు.

కొన్ని రోజులయాక, అనిరుద్ధుణ్ణి వెతక బోయిన చారులు తిరిగి వచ్చి, తమ ప్రయత్నం విఫలమయిందని చెప్పారు.

ఆ మర్నాడు ఉదయం కృష్ణుడు సభకు వచ్చాడు. ఉగ్రసేనుడు మొదలైన యాదవు లందరూ సభ తీరి ఉండగా అక్కడికి నారదుడు వచ్చాడు. అతిథి మర్యాదలన్నీ పూర్తి అయాక నారదుడు అందరి కేసీ చూసి, "ఏమిటి మీరంతా పుట్టెడు విచా రంలో మునిగి ఉన్నట్టున్నారు?" అన్నాడు.

"ఏం చెయ్యం? అనిరుద్ధుడు కని పించటం లేదు. అతని కోసం అంతటా వెతికించాం. కాని ఫలితం లేకపోయింది," అన్నాడు కృష్ణుడు.

"అన్నట్టు, ఇన్ని యుద్ధాలు చూశాను గాని, మీ అనిరుద్ధుడు బాణుడితో చేసిన యుద్ధం ఉందే అలాంటిది ఎక్కడా, ఎన్నడూ చూసి ఎరగను. అసలు ఏం జరిగిందంటే, ఆ బాణుడి కూతురు ఉష అనేది అనిరుద్ధుణ్ణి ప్రేమించి, చిత్రరేఖ అనేదాన్ని పంపింది. అది కాస్తా వచ్చి అనిరుద్ధుణ్ణి తీసుకుపోయి ఉషతో చేర్చింది.



ఈ సంగతి బాణుడికి తెలిసి అనిరుద్ధుడితో యుద్ధానికి వచ్చి, చావుదెబ్బ తిని, మాయా యుద్ధానికి దిగి, సర్పబాణాలతో అనిరుద్ధుణ్ణి కాస్తా బంధించాడు. అందుచేత నువు వెళ్ళి ఆ బాణుడి అంతు తేల్చుకో. బాణు డుండే శోణపురం ఇక్కడికి చాలా దూరం. అందుచేత ఏ గరుత్మంతుడి సహాయంతోనో వెళ్ళు. ఈ మాట చెప్పటానికే వచ్చాను. శలవు," అంటూ నారదుడు నిష్క్రమించాడు.

కృష్ణుడు గరుత్మంతుణ్ణి స్మరించాడు. గరుత్మంతుడు వచ్చాడు. వెంటనే కృష్ణుడూ, బలరాముడూ, ప్రద్యుమ్నుడూ గరుత్మంతుడి మీద ఎక్కారు. వాళ్ళు

శోణనగరం చేర వచ్చేసరికి వారి ముందు ఒక అద్భుతమైన వెలుగు కానవచ్చింది.

"కృష్ణా, ఈ వెలు గేమిటి?" అని బలరాముడు అడిగాడు.

"మనం ఇప్పుడు బాణుడి నగరాన్ని చేర వస్తున్నాం. శివుడు ఈ నగర రక్షణకు అగ్ను లన్నిటినీ నియోగించాడు. మనకు ఇప్పుడు ఎదురైనది ఆహవనీయాగ్ని. దీని సంగతి గరుత్మంతుడు చూసుకుంటాడులే," అన్నాడు కృష్ణుడు.

కృష్ణు డలా అంటుండగానే గరుత్మంతుడు ఆకాశగంగ నుంచి జలం పుక్కిట పట్టి అగ్నిపై చల్లి, దాన్ని ఆర్పేశాడు. కృష్ణుడు గరుత్మంతుణ్ణి పొగడాడు.

గరుత్మంతుడు మరికొంత ముందుకు పోయేసరికి, శివుడు నియోగించిన మిగిలిన అగ్నులు పెద్దపెట్టున సింహనాదాలు చేశారు. వాటిని విని బాణుడు యుద్ధ సన్నాహాలు ప్రారంభించాడు.

ఈలోపల అంగిరసు డనే అగ్ని, జ్యోతిష్టోముడూ, విభాంగుడూ అనే అగ్నులను ఇరు పార్శ్వాలా పెట్టుకుని, మిగిలిన అగ్ను లన్నిటితో సహా కృష్ణుడితో యుద్ధం చేయ వచ్చాడు.

కృష్ణుడు అతనితో, "ఓ అంగిరసుడా, మునులు వేల్చిన ఆహుతులు మెక్కి, కొవ్వి నా పైకి యుద్ధానికి వస్తున్నావా? పో అవతలికి!" అన్నాడు.

అంగిరసుడు కోపించి, "దీనితో నీ ప్రాణం తీస్తాను," అంటూ ఒక శూలం కృష్ణుడి పైన విసిరాడు. కృష్ణుడు దాన్ని తన బాణంతో దారిలోనే విరిచి, మరొక బాణంతో అంగిరసుడి రొమ్ము ఛేదించేసరికి, అంగిరసుడు నెత్తురు ఓడుతూ రథం మీద మూర్ఛపోయాడు. ఆ దెబ్బతో అగ్నులందరూ చెల్లాచెదరుగా పారిపోయారు.

వాళ్ళు అడ్డం తొలగగానే కృష్ణుడి కళ్ళ ఎదట శోణపురం కనడింది.





# అరణ్యపురాణం

## 29

మౌగ్లీకి మృత్యువును కవ్వించటమంటే చాలా ఇష్టం. అదీగాక అరణ్యంలో తన కెవరూ ఎదురు లేరన్నది రుజువు చెయ్యాలన్న అభిలాష కూడా అతనికి అమితంగా ఉండేది. చెట్ల మీది తేనె పట్లను అతను భాలూ సహాయంతో చాలా సార్లు దోచాడు. తేనెటీగలకు అడవి వెల్లుల్లి వాసన సరిపడదని అతనికి తెలుసు.

అందుచేత ఇప్పుడతను ఒక గుప్పెడు అడవి వెల్లుల్లి పీకి మూటగట్టుకుని ఏకాకి చెప్పిన నెత్తురు జాడనుబట్టి నడిచాడు. ఆ జాడ దట్టంగా పెరిగిన చెట్ల కిందుగా పోతున్నది. చెట్లగుంపులకూ, తేనెపట్లకూ మధ్య ప్రదేశంలో పొదలు తప్ప చెట్లు లేవు.

ఈ బయలు ప్రదేశాన్ని మౌగ్లీ ఒక గంట పాటు శ్రద్ధగా పరిశీలించాడు. తరవాత అతను చెట్ల కేసి తిరిగి వెళ్ళి, భూమికి ఎనిమిది అడుగుల ఎత్తున ఉన్న ఒక చెట్టు కొమ్మ ఎక్కి కూర్చుని, తన కత్తిని అరికాలి మీద పదును పెట్టసాగాడు.

మధ్యాన్నం కావస్తూండగా అతనికి కుక్కలతండా వాసన తెలియవచ్చింది, పద ధ్వని కూడా వినిపించింది. శునకులు ఏకాకి నెత్తురు జాడను పసికట్టి వస్తున్నారు. ఎర్ర కుక్క ప్రమాణం తోడేలులో సగం కూడా ఉండదు. కాని ఆ కుక్కల కాళ్ళలోనూ, దవడలలోనూ చాలా శక్తి ఉన్నది. శునకుల నాయకుడి తల కనబడగానే మౌగ్లీ, "వేట సాగాలి!" అని కేక పెట్టాడు.

శునక నాయకుడు తల ఎత్తి చూశాడు. అతడి వెనకగా వచ్చే అసంఖ్యాకులైన శునకులు ఆగిపోయారు. వాళ్ళ నోళ్ళు రక్తమయంగా ఉన్నాయి. వాళ్ళందరూ కలిసి రెండొందలకు తక్కువ ఉండరు.

అట్ట చివరి బొమ్మ





మౌగ్లీ ఇకిలిస్తూ, ఎలుక లాగా కిచకిచ శబ్దం చేశాడు, శునకులు తన దృష్టిలో ఎలుకల కన్న ఎక్కువ కాదన్నట్టు.

కుక్కలతండా చెట్టు మొదలును చుట్టు ముట్టింది. శునక నాయకుడు రౌద్రంగా ఒకసారి మొరిగి, "నువు మానుకోతివి!" అని తిట్టాడు.

దానికి జవాబుగా మౌగ్లీ తన కాలును శునక నాయకుడి నెత్తికి ఎగువగా చాపి కాలివేళ్ళు ఆడించాడు. దానితో తండాకు ఆగ్రహావేశం వచ్చి, వెర్రెత్తింది. శునక నాయకుడు ఎగిరి అందుకోబోతే మౌగ్లీ తన కాలును పైకి లాక్కుంటూ, "కుక్కా, ఎర్ర కుక్కా! దక్షిణదేశానికి తిరిగి పోయి తొండ లను పట్టుకుని తిను! నీ కాలివేళ్ళ సందున అంతా బొచ్చే!" అన్నాడు, తన కాలి వేళ్ళను మళ్ళీ ఆడిస్తూ.

"బొచ్చులేని కోతిగాడా, దిగి రారా! ఎలాగూ నిన్ను తిండికి మాడ్చి చంపేస్తాం!" అని శునకులు కేకలు పెట్టారు.

మౌగ్లీ కోరినది కూడా ఇదే—శునకులకు ఆగ్రహం తెప్పించటం. అతను కొమ్మమీద చాచుకుని పడుకుని, శునకులను గురించి తన కున్న అభిప్రాయాలన్నీ వివరించ సాగాడు. మౌగ్లీ నోరు మహా చెడ్డది. అతని

శునకనాయకుడు ఏకాకి రక్తపు జాడ వెంబడి తండాను తీసుకుపోవటానికి దీక్షగా ప్రయత్నిస్తున్నాడు. అలా జరిగినట్టయితే పగటిపూటే శునకులు తోడేళ్ళస్థావరాలను చేరుకుంటారు. చీకటి పడినదాకా శునకు లను తానున్న చెట్టు దగ్గిరే నిలిపెయ్యాలని అతని ఉద్దేశం.

"ఎవరి అనుమతితో మీరు ఇటుకేసి బయలుదేరి వచ్చారు?" అని మౌగ్లీ శున కులను అడిగాడు.

ఒక శునకుడు తన కోరలను వెళ్ళ బెట్టుతూ, "ఈ కనబడే అరణ్యాలన్నీ మావే!" అన్నాడు.



మాటలు శునకులపైన శూలాలకన్న క్రూర మైనవి. వాటి ప్రభావంతో శునకులు గుర్రు పెట్టటంతో మొదలుపెట్టి, తలలు ఎగిరి పోయేటట్టు మొరగటందాకా వచ్చారు. కొమ్మమీద ఉన్న మౌగ్లీని అందుకోవాలని శునక నాయకుడు చాలాసార్లు ఎగిరాడు. మౌగ్లీ కుడిచెయ్యి సిద్ధంగానే ఉంది గాని, గురి తప్పటం ఇష్టంలేక అతను చెయ్యి చేసుకోలేదు.

చిట్టచివరకు శునకనాయకుడు కోపా వేశంతో నేలమీది నుంచి ఏడెనిమిది అడు గుల ఎత్తు ఎగిరాడు. మౌగ్లీ కుడిచెయ్యి కొండచిలువ తలలాగా చప్పున ముందుకు వచ్చి శునకనాయకుడి మెడ పట్టేసింది. ఆ అదురుకు మౌగ్లీ ఉన్న కొమ్మ ఊగి పోయి, అతను కింద పడినంతపని జరిగింది.

కాని మౌగ్లీ కుక్కమెడ పట్టు విడవక శునకనాయకుణ్ణి ఒక్కొక్క అంగుళమే కొమ్మ మీదికి లాగాడు. అతను ఎడమ చేత్తో కుక్కతోక కోసేసి, శునకుణ్ణి కింద విడిచేశాడు.

ఇంకేమీ అవసరం లేదు. ఇక శునకులు ఏకాకి నెత్తురు జాడను లక్ష్యపెట్టరు. మౌగ్లీ రక్తం తాగికాని వాళ్ళు ఆ చెట్టు కింది నుంచి కదలరు—లేదా అతని చేతిలో చావనైనా



చస్తారు. వాళ్ళు ఉన్నచోటనే చుట్టలు చుట్టుకుని పడుకోవటం మౌగ్లీ చూశాడు. ఇక వాళ్ళు వెళ్ళిపోయే భయంలేదు గనక మౌగ్లీ చెట్టుమీది పైపంగకు ఎక్కి, విశ్రాం తగా నిద్రపోయాడు.

మూడు నాలుగు గంటలయాక అతను నిద్రలేచి చూసేసరికి శునకులంతా అక్కడే ఉన్నారు. ఏమీ చడీచప్పుడూలేదు. వాళ్ళ కళ్ళు ఉక్కులాగా మెరుస్తున్నాయి. సూర్యుడు అస్తమించుతున్నాడు. ఇంకొక అరగంటలో తేనెటీగలు పని విరమిస్తారు. మసక వెలుతురులో శునకులు అంత బాగా పోరాడలేరు.

మౌగ్లీ చెట్టు కొమ్మ మీద లేచి నిలబడుతూ శునకులతో, "మీ రింత శ్రద్ధగా నాకు కాపలా ఉండవలిసిన పనిలేదు. అయినా నేను మిమ్మల్ని మరవను. మీరు నిజమైన గస్తీగాళ్ళు. నాకది అంత నచ్చలేదు. అందుచేత మీ పెద్దాయన తోక తిరిగి ఇవ్వదలచలేదు. నీకు సమ్మతమేనా, ఎర్రకుక్కరాజా?" అన్నాడు.

"ఓరి మానుకోతిగాడా! అట్టే వాగకు. నీ డొక్కను నేనే స్వయంగా చీరేస్తాను," అన్నాడు శునకనాయకుడు.

"తొందరపడకు, ఎలుకబుద్ధీ! అందరికీ మొండితోకలు కాగలవు. మీ దక్షిణదేశానికి వెళ్ళి ఒక మర్కటుడు ఇలా చేశాడని చెప్పుకో. పోవా? అయితే నావెంటరా, నీకు జ్ఞానోపదేశం చేస్తాను!" అంటూ మౌగ్లీ మర్కటుల లాగా తానున్న చెట్టు నుంచి మరొక చెట్టుకు మారి, మళ్ళా దాని నుంచి మరోచెట్టుకూ, ఇంకో చెట్టుకూ వెళ్ళసాగాడు. శునకులు తలలు ఎత్తి అతని కేసే చూడసాగారు.

అప్పుడప్పుడూ మౌగ్లీ కాలుపట్టుతప్పి పడబోయినట్టు నటించాడు. అప్పుడు చూడాలి శునకుల తొక్కులాట! తళతళలాడే కత్తి చేతబట్టి చెట్ల మీదుగా కదులుతుంటే, నిప్పులాగా మెరిసే బొచ్చుతో శునకులు చెట్లకిందుగా అతన్ని అనుసరించి నడవటం ఒక విచిత్రమైన దృశ్యం.

"నీ జాడ మాకు తెలియకుండా చేదామనా నీ ఉద్దేశం? చచ్చేదాకా నిన్ను వదలం!" అన్నారు శునకులు.

"నీ వెధవ తోక నువే ఉంచుకో!" అంటూ మౌగ్లీ శునకనాయకుడి తోకను వెనక్కు విసిరివేశాడు. శునకులందరూ దాని కేసి మూగారు. మరుక్షణం మౌగ్లీ చెట్టుబోదె వెంబడి సర్రున నేలకు జారి, వాయువేగంతో కొండ తేనెపట్లున్న గుట్టల కేసి పరిగెత్తసాగాడు.



# 83. యాప్ రాతినాణెం

దిగువ బొమ్మలో కనిపించేది రథచక్రం కాదు, యాప్‌దీవిలో నివసించే వారి రాతినాణెం! 12 అడుగుల వ్యాసం గల ఈ నాణాన్ని ఎవరూ కదిలించ లేరు. అది ఒకరి సొత్తు కూడా కాదు, సామాజికుల ఉమ్మడి ధనం. ఇవి యాప్‌దీవిలో తయారు కావు, పలావుదీవిలో తయారై యాప్‌దీవికి రవాణా అవుతాయి. ఈ దీవులను కారొలైన్‌దీవు లంటారు. అవి పెసిఫిక్ సముద్రంలో ఉన్నాయి.



Photo by Shantaram R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

ప్రజా వ్యక్తి

పంపినవారు:
డి. వరలక్ష్మి, విశాఖపట్నం-1

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

పరాశక్తి

పంపినవారు:
డి. వరలక్ష్మి, విశాఖపట్నం-1

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ప్రజావ్యక్తి

రెండవ ఫోటో: పరాశక్తి

పంపినవారు: దార్ల వరలక్ష్మి,

కంచర స్ట్రీట్, విశాఖపట్నం-1

బహుమతి మొత్తం రు. 10/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఫోస్ఫోమిన్



శక్తిని పెంపొందించును.

ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని హెచ్చించును.



శరీరముయొక్క
రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబమంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




SQUIBB TIT

SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

Shilpi SC 50 A/67 Tel

# 'ఇప్పుడు నా చురుకుతనాన్ని చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!'

కాని, కొన్ని నెలల క్రితము నీరసంతో నేను ఆఫీసు పని సరిగ్గా చేయ లేక పోయాను. చివరకి ఒక డాక్టర్ని సంప్రదించాను.

డాక్టరు ఇలా అన్నారు: "మీకు కావలసినంత పోషణ లభించలేదు. హార్లిక్స్ త్రాగండి!"



హార్లిక్స్ త్వరలోనే నాకు శక్తి ఉత్సాహములను కలిగించింది. ఇప్పుడు నేను ఓపికతో చురుకుగా పని చేయడం చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!



హార్లిక్స్ వాడడం వల్ల శక్తి ఉత్సాహాలతో వున్నాను!

సరైన పోషణ లేక పోవడం వల్ల కలిగే నీరసము, అలసట కొన్ని సమయాల్లో ఉద్యోగమునకే హాని కలిగించవచ్చు. వీటికి ప్రతివిధిగా డాక్టర్లు హార్లిక్స్ సిఫార్సు చేస్తారు. హార్లిక్స్ అదనపు పోషణత్వాన్ని యిచ్చి శక్తి ఉత్సాహము, మంచి ఆరోగ్యము కలుగచేస్తుంది.




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

HL 7486 A

# దిలీప్ అతడి స్నేహితులు

చేపలుపట్టే అద్భుతకథ

చేపలవేటకు వెళ్లి తిరిగివచ్చిన దిలీప్ బృందం, రైల్వే పట్టాలదగ్గర ఫిష్ ప్లేటు లేకపోవటం గమనించారు. రైలు వస్తోంది. దిలీప్‌కొక ఆలోచన తట్టింది.... అది పనికొస్తుందా ?























అతి తెల్లనైనకాంతి, అతి స్థిరమైన శక్తి, అది ముమ్మాటికీ 'ఎవరెడి'

UC 4349



# గోపాలుని రహస్యం
























**జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ**

# AWARDS!

## WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST
ONLY
WE DO OUR BEST



**PRASAD PROCESS PRIVATE LTD**
CHANDAMAMA BUILDINGS MADRAS-26